చ. కడుభయమంది వారికిఁ ద ♦ గన్మఱి వైశ్యులఁబోలె వశ్యులై
పుడమి నతిప్రసిద్ధులగు ♦ భూపతులెల్ల మహాధనావళుల్
దడయక తెచ్చి యిచ్చి రవి ♦ దానము సేయుట పార్దివత్వ మే
ర్పడియెఁ బృథాతనూజులకుఁ ♦ బాండవతేజము బర్వె నెల్లచోన్

లోకంబుల నతులపరాక్రమోపార్జితకీర్తిమంతులయి ధనంబు ఘనంబుగ నార్జించి యున్నతులగుచు యశోవల్లికల దిశావలయంబుల వ్యాపింపజేయు పాండవలక్ష్మి నాకసమ్మతమై నానయనంబుల మాడ్చివేయుచున్నది. మాతులా! మానధనుండయిన మానవపతికి సపత్నుల సమృద్ధియు, ఆత్మగౌరవంబును సహింప శక్యములుగావు. నా ప్రాణత్యాగంబున కుపాయ మాలోచించుకొనియెద.

శకుని—నాయనా! రాజరాజ! ఎన్నిమారు లీ పరివేదనము. రాచబిడ్డ డిట్లు ధైర్యపడువాఁ డుండునా? పౌరుష ముండవలె. శత్రువుల రణరంగంబున జయింపవలయు, సిరు లపహరింపవలయు, సోదరశతపరీవృతుండవయి గదాదండ సూత్రసహాయుండవై సమిద్రంగంబున దుమికి నీవా నేనా యని శత్రువుల ప్రాణముదీయుటొండె చచ్చుటొండె. ఇంతియేకాని దిగులుపడి లేనిపోనిమనోవ్యాధులతో కృశించి యున్నచో నీ దాయకుఁ బరిహాసాస్పదుండవు కావా? గంపెడుబలగ ముండియు దిక్కులేనివానివలె చింతాబుగాక్రాంతుఁడవై యేకాంతంబునఁ విచారించఁ బౌరుషమా? చెప్పుము.

దుర్యో—గాంధారేయ! యీ పౌరుషమే నాకడ నుండిన మీయందఱి చేతను దెప్పుడులు పడవలసిన కర్మమేమి పట్టినది? దాయ లనుక్షణము తామరతంపరయి విజయలక్ష్మి కరుణాతరంగితావలోకను లయి యుండఁజూచి సహించుటెట్లు గలుగును? నా సోదరశతంబును నేనును గలసి పాండవేయులకడ నుండు పరాక్రమైక జీవనుండగు నొక్క సేవకునికిఁ జాలము. నేనేకాదు. ఆ రాజసూయాధ్వర సమయంబున.

ఉ. యాదవుచేతి చక్రము భ ♦ యంకరమై శిశుపాలమస్తక
చ్ఛేదము చేసినన్ గడు ప్రసిద్ధులు ♦ శూరులునైన రాజుల

యాదవపుముండటన్ జయ జయ. ధ్వను లిచ్చిరిగాని వాని శౌ
ర్యోదయవృత్తి గట్టెమర నోపర యెవ్వరు విక్రమింపఁగన్

మాతులా! వీరపరాక్రమౌదార్య గాంభీర్య ధుర్యులగు రాజశిఖా మణులందరు చూచుచుండ శ్రీకృష్ణుఁడు, శిశుపాలుండు దనను తిరస్కరించెనని మేనత్తకొమరుండను బంధుత్వమైనను విచారింపక పినతల్లి కొమరుండను ప్రేమ నొక మూలకుఁ ద్రోసి ధర్మరాజు చూచుండ సభాసదనంబు వధ్యస్థానంబు గావించుచు శిశుపాల కంఠ విలుంఠన మాచరింప సభాసకులందరు నోరు మెదలింపక కుక్కిన పేలవలె నొదిగి యొదిగి తెల్లమొగములు వైచుకొని చిత్తము చిత్తమనుచు భట్రాజులవలె నా యాదవునిఁ బొగడిరి. కాని యిది తగదని చెప్పగలిగిన మగవాఁడు గలిగెనా? చూడవచ్చిన రాజు లందఱు రొయ్యచేపలకు గల నిరర్థకపు మీసములవలె బారెడు బారెడు మీసములు పెంచుకొని కొయ్య బొమ్మ లలంకరించుకొని నటు లలంకారములు చేసికొని, తాడిచెట్టు నెక్కువాఁడు నడుము నకు బిగించుకొనిన కల్లులొట్టవలె ముప్పది రెండాయుధములు దగిలించుకొని, కదలక, మెదలక చిత్రప్రతిమలవలె రాతిబొమ్మలా యనునట్లు మోములు వ్రాలవేసికొని కూర్చొనిన నీరాజులు ఎలిక రాజులు, ఒరదరాజులు, క్షీబరాజులు, తరాజులు, వాజలు, దేజెలు గాని రాజులా? పౌరుషములేక గాజులు దొడిగించుకొని, యంతః పురంబుననుండు క్షత్రియజాతి విగత భర్తృకలవలె, సిగ్గులేక, కృష్ణుని, ధర్మరాజును, స్తోత్రముఁ జేయసాగిరి. అప్పుడు నామనంబు నం గల పరితాపము అంతయింత యని చెప్పఁజాలను. ఆసమయ మందున నేను సముద్రమయియుండిన హాతాత్తుగాఁ బొంగి పాండవ యాదవ చక్రంబులఁ బుడుంగున ముంచివైచెద. నేను సింహంబ నైనచో, పృథాతనూజాత మదకుంభికుంభంబులపై రివ్వుని నెగిరి పక్కనఁ బగులఁగొట్టెదను. పౌరుష లేశంబు నా హృదయంబున గంధంబునకైన నిలిచియున్న నాయుధముచేఁ బూని యశోవా, మృత్యుర్వా యని సభాభవనము రణరంగముసేసి, రక్తప్రవాహ

ములు ప్రవహింపఁజేసెద. ఇందే ప్రజ్ఞయు నాచెంత లేక, చేతగాక గాజులు తొడిగించుకొని, యంతఃపురవాసులగు నాఁడువాండ్రవలె సిగ్గుపడి తల వంచుకొని, యూరకుండవలసి వచ్చినది. (నాలుగు మూలలు చూచి) ఇక్కడ నాఁడువాండ్రెవరు లేరుగద? ఈ మాట వారు విన్న నీవు మాజాతికిం గొరగావని తిరస్కరింతురే మొ! ఎన్ని విధముల మయసభావృత్తాంతము జ్ఞాపకము జేసికొనక కుండవలయు నని ప్రయత్నించెద మనుకొన్నను మయసభాభవనము తలంపునకు వచ్చి నప్పుడెల్ల దాని తళతళలు నా కనులముందఱఁ గట్టినట్లుండ, సూర్యకిరణంబులు ఆదిత్యోపలోపరి భాగంబునఁ బడినమాత్రనె జ్వాలలు ప్రజ్వరిల్లునట్లు, నా మానసంబ స్వాధీనంబయి భగ్గుభగ్గున మండుచుండును. మామయ్యా! వెయ్యిమాట లెందుకు ?

ఉ. ఏనును క్షత్రియుండనని యెట్లు ♦ వచించెదనయ్య వైరిభూ
జానులు పాండవేయులకు ♦ సల్పితి నగ్గులు నేను పెక్కు ల
యైనను వారు వృద్ధియయి ♦ ఖ్యాతిని గాంచిరి దైవయత్నమే
దానికిఁ గారణంబగు వృ ♦ థా గద నాదు ప్రయత్న మంతయున్

అరణ్యంబునఁ బుట్టి, యచ్చటనే బెరిగి, యచ్చటనే జీర్ణించు కుసుమములచందమున, నాకోర్కెలు నామానసమునందే జీర్ణముగావలసి వచ్చె. నాదుఃఖము మీకుజెప్పి మీకును దుఃఖము కల్పించుటయే గాని, నాదుఃఖాగ్ని నార్పువారును, తీర్చువారును లేరుగదా ? మాతులా! పౌరుష హీనుండనయినను, నీకు మేనల్లునికదా ? కడసారిగా నన్నొక్క పరి గాఢముగా కౌఁగిలించుకొనుము. (అని శకునిని కౌఁగిలించు కొనుచున్నాఁడు)

శకుని——ఎంతలో నీ కింత బుద్ధిమాంద్యము, అస్థైర్యము కలిగెనోయి! గోటితోఁదుంచఁదగు కార్యమునకు గొడ్డండ్ర నుపయోగపరుప యత్నించుచుంటినిగాని వేఱొండుగాదు. శత్రురాజ్యసంపద లపహరించుట లీశకునిఁ గనుగిలిపినంతకాలము పట్టదు. నాప్రజ్ఞ నేనే చెప్పుకొనరాదు. అయినను నాకును నీకును గల యభేదము, నీ

యందు నాకు గల వాత్సల్యము, నీవిప్పుడు పడుచుండు పరితాపము చూడఁ జూడ నామానసంబునఁ గుతూహల ముత్పన్నమయి నా ప్రజ్ఞాతిశయమును వెల్లడింపఁ బ్రేరేపుచున్నది. ఈ శకుని నిశ్చయముగాఁ దలఁచినఁ జూచుచుండఁగనె యెదిరికిఁ దెలియనీయక, కను కదలనీయక, కనుపాప లూడఁదీయఁగల శక్తిగలవాఁడు. సన్నఁగ దాల్చిన మనుష్యఁగన్నులలో జల్లగఁ జల్లి, రాజాధిరాజునైనను, బుజ్జగించి పంపించఁగలఁడు. వేయి కన్నులతోఁ జూచువానినైనను మోమున మసి బూసి నేరేడుగాయఁ జేయఁగలఁడు. పదునెనిమిది శాస్త్రములు పారఁజదివిన పండితునైనను, నాలుగు మాటలుచెప్పి, పలిటీలు గొట్టించి అధోలోకమున కణఁగఁద్రొక్కఁగలఁడు. వెయ్యి మాటలెందుకుః తిమ్మిని బ్రహ్మిఁజేయఁగలఁడు. బ్రహ్మినిఁదిమ్మిఁ జేయఁగలడు. కావున ధైర్యమవలంబించి. నీ తండ్రియొద్ద లేని దుఃఖము తెచ్చిపెట్టుకొని ప్రాణత్యాగము చేసికొనియెదనని సాహసముసేయ నుంకించుము. నేనొకయుపాయము చెప్పి, పగతుఱ సిరులు నీ చేతిలోఁ బెట్టెద. నేను సమయము వచ్చినప్పుడు మాయ మాటల్లుచెప్పి, యరచేత వైకుంఠము చూపి, ముక్కాలమూఁడు గడియలలో మొగమున బూది పూయలలో మనము పెట్టినదిపేరు. అట్లుసేయకున్న నాపేరు శకుని కాదు, నాయనా! నే నబద్ధమాడను. నిన్ను చంపుకొనినట్లు. కొలఁదికాలములోఁ బాండవ రాజ్యలక్ష్మి స్వయముగా నిన్నుఁ గౌగిలింపఁగలదు. నమ్ముము.

ప్రాతి—అయ్యా! మహారాజుగారిని నీకొఱకై వృద్ధ ప్రభు వెదకుచున్నాఁడు.

శకుని—ఒంటరిగ వచ్చుచుండెరా? వెంట నెవరైన నుండిరా?

ప్రాతి—ఎవరును లేరు. పరిచారకుఁడు మాత్రమే.

శకుని—అట్లయిన నీవు పోయి పరిచారకుల నవల నిలిపి, నీవే మహారాజును లోనికిఁ దీసికొనిరమ్ము. పొమ్ము.

ప్రాతి—చిత్తము. అని (నిష్క్రమించును.)

శకుని—అబ్బాయి! యొకమాట వినుము,

దుర్యో—మామయ్యా! విన్నమాటలు చాలు. నీకుఁ బరుల మానస
మున గలుగు దుఃఖము బులిపిల్లలకుఁ బప్పులు పెట్టి యాడించునట్లు
మాయమాటచే బోఁగొట్టగల నేర్పు గలిగినను నీ దుర్యోధన
హృదయాంతర్గతాసూయాగ్ని దిశావలయంబుల పెటేలున పేల్ప
నున్నది. ఈ దురోధనుఁడు నీ మాయలకు లోఁబడి, మయసభా
పరాభవము మరచిపోవువాఁడు మాత్రముగాఁడు. పాండవ లక్ష్మీ
ప్రభాంధీభూతుఁడు గాన ప్రకృతమితి కర్తవ్యతామూఢుఁ డయి
నాఁడు. ప్రకృత మాలోచింపుము.

శకుని—ఇప్పుడు తండ్రితోఁ జెప్పవలసిన మాటలు చెప్పుము. నేను
చెప్పఁబోవు నుపాయమున కొడంబడునట్లు చేయుము,

దుర్యో—ఉపాయమో యపాయమో యనియెదవుగాని అది యెయ్య
దియో నాకుఁ దోఁచదు. నీవు చెప్పవు. నీ మాటలచే నాకు
దుఃఖముఁ మరింతఁ బెద్దసేయుచుంటివి.

శకుని—చెప్పుటకేమున్నది. భాగినేయా! యిటు వినుము. నేను జూద
మాడుటయం దందెవేసిన చేయినని నీకు వేఱుగ చెప్పనక్కఱ లేదు
గదా? ఆ యాటయందు నన్ను జయింప మగటిమిగల మగవాఁడు
ఈ లోకములోఁగాదు మఱి యే లోకములో నయినను పుట్టి రాఁతల
యును. ఎంత యాటగాఁడైనను మూఁడు నిముసములలోపలఁ
గన్నుల దుమ్ముకొట్టి చేతిసొమ్మెల్ల గుంజుకొని బుక్కాఫకీరునిజేసి
చిప్ప చేతికినిచ్చి పంపించుటలో మనము పెట్టినది పేరు! సారెలు
లికించుట, చవ్వ దువ్వా, దువ్వ చవ్వాసేయుట, మొట్టుట,
మించుట, నెత్తముత్రిప్పుట మొదలయిన యాట బూటకములలోఁ
జూచుచుండఁగనే యెదిరిని పల్టీలు గొట్టించుటలో నన్ను మించిన
చేయియుండదని త్రికరణశుద్ధిగా నమ్ముము. జూదమాడుటయందు
ధర్మజునకు మిగుల ప్రేమయేగాని, యాటయందలి నైపుణ్యము
తక్కువ. నీ తండ్రినొప్పించి, పాండవులఁ బిలిపింపుము. జూదంపు

కొలువులోనికిం దింపుము. పాచికలు చేతం బట్టింపుము, కదలక, మెదలక గన్నులలోం గాఢముంగొట్టి పాండవలక్ష్మి యంతయు, ముక్కాల మూండుఘడియలలో నిచేం జిక్కంజేయకున్న నన్ను పేరునం బిలువవద్దు.

దుర్యో—(లేచి శకునినిం గౌంగిలించుకొని) మామయ్యా! మా తండ్రి నెట్లో యొప్పించెదగాని, నా కింతమాత్రపు టుపకారముజేయుము. నీ మేలు మఱవను. పాండవ రాజ్యలక్ష్మి వేఱ నాయదికాని, సర్వము నీ వనుభవింపుము. ఈ యుపాయము కర్ణునకుం దెలియం జేయుదమా?

ప్రాతి – రాజరాజుగారి సందర్శనమునకు వృద్ధరాజు వచ్చుచున్నారు.

దుర్యో – (పరుండి) మామయ్యా! కొన్నిమాటలు నీవు చెప్పుము.

ప్రాతి – (ధృతరాష్ట్రుని చేయిపట్టుకొని నడిపించుకొని రావలయును, )

ధృత – (చెయ్యిచాంచి ఏడీ? అబ్బాయీ! నాయనా! మహారాజా పలుకవేమి? అని చేతితో వెతుకుచుండవలయును.)

శకుని — బావగారికి శకుని నమస్కరించుచున్నాండు,

ధృత – నాయనా! నీ విచ్చటనేయున్నావు? నీ మేనల్లుం డేడోయి? (స్వగతము) వీఁడు చేరినాఁడు, కొంప నాశనము చేయంగల యోచనలు చెప్పుటలో మొనగాండు. (ప్రకటముగా) బావ! నీ పెద్ద మేనల్లుండేడీ? ఏమి వానికి జబ్బు? విచారించినావా?

శకుని— నేను గడియసేపటినుండి బతిమాలి బతిమాలి నోరు కాయగాచినది. పలుకఁడు, కదలఁడు. మీంద చెయ్యివేసినం గాలిపోవుచున్నది.

ధృత – జ్వరమా?

శకుని—జ్వర మేమిటి వక్షగింజవేసినం బేలగింజ, కణ కణలాడునిప్పు మండిపోవుచున్నది. శరీరమంతయుం దెల్లగాం జాలిపోయి పిండి బొమ్మవలెనున్నాడు, రక్తముబొత్తుగావిఱిగిపోయినది. వానికి రూపే

చెడిపోయినది. కనులవెంబడి నీరుమాత్రము కాలువలు గట్టుచున్నవి ఆహారమన్న రోత. బాధ యేమో చెప్పడు.

ధృత—మన వైద్యుని విశారదుని పిలిపింపలేదా? ఏడీ కుఱ్ఱవాఁడు (అని చేయి చాచవలయును.)

శకుని—పిలిపించ కేమి? విశారదుఁడు వచ్చియిపుడే వెడలినాఁడు. శరీర మునందెంతమాత్రము రుగ్మత కానుపించదు. ప్రభువున కేదియో మనోవ్యాధి యని చెప్పినాఁడు. ఇటురండి. (అని ధృతరాష్ట్రుని చేయి దుర్యోధనునిమీఁద బెట్టి) రామ రామ, బొత్తుగాఁజిక్కి శల్యమయినాఁడు. బొమికలబొమ్మ. రెండు దినములలో నీరు తీసి నట్లు శరీరము తీసిపోయినది. కారణము తెలియదు.

ధృత—(దుర్యోధనుని శరీరము పట్టిచూచి) వీని శరీర మెంత క్రాగు చున్నది. ఎంత చిక్కిపోయినది. అబ్బా! వీని నిశ్వాసవాయువుల వెచ్చదనము దగ్గర మనిషిని గాల్చివేయుచున్నది. (ప్రకటముగా) అబ్బాయి! దుర్యోధన! నీ కీ మనోవ్యాధి యెందుకయ్యా! నీకేమి కొఱంత నాయనా! కౌరవుల గౌరవంబును కౌరవైశ్వర్యంబును నీకుఁ బేర్మిచే సమర్పింపఁబడినదిగదా! నీ సోదరులు, నీ యనుచరులు నీ మిత్రులు, నీ బంధువులు నీయం దనురాగము గలవారయి నీ [illegible] యున్నవారు. సమస్తభూతలాధినాథులు నీయడుగు [illegible] సర్వదా నిన్నుభజించుచున్నారు. దేవేంద్రు [illegible] నీకు గలవు. సకల భోగములు [illegible] ఎంచుచున్న నీ కేమి తక్కువ చెప్పు నాయనా?

[illegible] లా [illegible] లా రథప్రకరమా ♦ కాల్బంటులా మేడలా
[illegible] లా రత్నములా ధనవ్రజము దాసస్తోమమా తక్కువే
మి నా తండ్రి! [illegible] యొడలి మేరం గృశింపంగ నీ
దుఃఖస్థానే దురపిల్లనేల తనయా! ♦ దుర్యోధనా! సెప్పుమా?

నీ వేమియుఁ జెప్పక లో లోపలఁ గుందుచుండ నా కిఁక దిక్కె వరో? నీ తోడిదే లోకముగా నమ్మియున్న మ మ్మేల దుఃఖ

సాగరమునందు ముంచెదవోయి తండ్రీ! నీవు పలుకకయున్న నేను బలవంతముగాఁ బ్రాణములు విడిచెద.

శకుని—అబ్బాయి! భాగినేయ! మీ తండ్రి వెుదలైనపెద్దల బ్రతి మాలినను పలుకకుండుట న్యాయమగునా? నీ మనోగతం బెఱిం గించినఁ దప్పక తీర్పఁగలిగిన మీ నాయనగారితోఁ జెప్పక యింక నెవరితోఁ జెప్పెదవు.

దుర్యో—(తనలో కలవరించినట్లు) ఆ! దుష్టాత్ములారా! మాయా సభా భవనంబున మనోవిభ్రాంతిచేఁ దిరుగుచుండ స్ఫటికశిలాతలంబు నాఫాల తలంబునకుం గొట్టుకొనగనే చూచు — దాసీజనంబులతోఁ గూడ నవ్వెదవా? దీనికిం దగిన యవమానము సేయకయున్న నాపేరు సుయోధనుఁడే కాఁడు.

ధృత—కుఱ్ఱవానికిఁ బిచ్చి యెక్కువయైనది. అసందర్భపు మాటలాడు చున్నాఁడు. ఉన్మాదము కాదుగద!

శకుని—కాదు. కాదు. ఉన్మాదము కాదు. పాండవగృహంబున నీ కుమారునకు జరిగిన మర్యాద. బలవంతులు ఒక్కరుగారు అయిదు గురు మగలు గలిగిరిగదాయని నిజ్జోఁగి ద్రౌపది రాజరాజను లక్ష్యంబు లేక నీ కుమారునిఁ జూచి నవ్వి చప్పట్లు గొట్టినదఁట.

ధృత—మహాసాధ్వి పరిహాసమునకు నైనను పరుల మనంబు నొప్పిం పదు. అట్టి యపాంసులాశిరోమణులుండుటంబట్టియే లోకము నిలిచి యున్నది. అట్లుచేయునా?

దుర్యో—ఆ, చేయదు చేయదు, అవును నిజమే. కావున నీ దుర్యో ధనుఁడు బలవంతముగాఁ బ్రాణము లెడబాయునుగాని యా యిల్లా లయిన కోడలిని, నా మెము గలయిన కొడుకులను పెట్టి లోకము మును గకుండ నిలువఁజెట్టుము. (అని నెత్తి కొట్టుకొను చున్నాఁడు.)

శకుని—(చేతులు పట్టుకొని) అబ్బాయి! నీకేమైనఁ జాద స్తమా యేమి? కాలమహిమ! యిప్పుడు అయిదుగురు మగలు కలవారె మహాపతి వ్రతలు. కలియుగములో బదిమంది నూరుమంది వెయ్యిమంది

భర్తలు గల వీరపతివ్రతలు బయలుదేరి లోకములు మునుగకుండ నాని పెట్టెదరు.

ధృత— బావా : మధ్యమధ్య తెలియని పుల్లవిరుపుమాటలు మాట్లాడకు. అకారణముగాఁ బేడ బెల్లము నేకము చేయఁగూడదు. ధర్మసూక్ష్మము లనేకములు గలవు.

శకుని— నాకేమి పట్టినదయ్యా పుల్లవిరుపుమాటలకు? నీ కొమరునిపై నీకుఁ బ్రేమలేకపోయినను అక్కగారు కబురంపుటచే నేను వచ్చినాను గాని లేనిచో నాకేమి? మీరును మీరును గంగలో దుముకుఁడు. ద్రౌపది మహాసాధ్వి యయితే నాకేమి? నీ కొమరుని కమర్యాద యయితే నాకేమి? నేను పోయెదను.

(అని వెళ్ళఁబోవుచుండఁగా)

దుర్యో— (లేచి శకునినిఁ బట్టుకొని) మామయ్యా! యీ దిక్కులేని పీనుగనేమి చేసి పోయెదవు? తండ్రికిఁ బనికిమాలిన గరాసుని నీచేతి మీఁదుగాఁ గడతేర్చిపొమ్ము.

శకుని— నాయనా! అట్లు తిట్టుకొనకురా! మే మందఱము తోడివారము కదా నాయనా! నీ మనోవ్యాధియే చెప్పవైతివి, మీ తండ్రిగారు నీసంగతి విచారించక ద్రౌపది మహాసాధ్వియఁట. వారు లోకముల నాని పట్టెదరఁట. నిజమాడిన నిష్ఠురము. మావి ఫల యప్రమాటలు గంటనుంచి బతిమాలిన నీవు మాట చెప్పవు.

ధృత— (స్వగతము) కాలము తప్పివచ్చినది. కుఱ్ఱవాఁడు బొత్తిగాఁ జిక్కిపోయినాఁడు. వీని కనుకూలముగ నటించకపోయిన వీఁడు బలవంతముగాఁ బ్రాణము దీసికొనును. (ప్రకటముగా) బావా! మనస్స్వస్థత లేక పలికిన పలుకుల కింతకోపమా! జాత్యంధుఁడ నగు నే నీ పిల్లలఁ బోషింపఁగలనా? నీవే యలిగిన నే నేమి చేయఁగలను? నా బహిఃప్రాణమయిన దుర్యోధనునికన్న నాకు లోక మెక్కుడా? అబ్బాయి! ఇటురమ్ము. కూర్చుండుము. ఇటువినుము, తండ్రీ! యిటురా.

చ. అనుజులు సేవకావళియు ♦ నాప్తులు మిత్రులు మంత్రివర్గముల్
వినయము మీఱ నిన్గొలిచి ♦ ప్రేముడి నీయెడ సానురాగులై
ఘనతరభక్తియుక్తులయి ♦ కాన్క లొసంగెడు రాజకోటి నీ
తనువిటుఁ జిక్కనేల ? మదిఁ ♦ దద్దయుఁ గుందగనేల చెప్పుమా?

రాజరాజ : రాజ్యభోగపరాఙ్ముఖుండ వగుటకు నీ కేమి లోపము తండ్రీ.

దుర్యో—(విచారముతో)తండ్రీ! ఏమిలోపమా? యంతయులోపమే. నే నీవిషయ మంతగా నీతో ముచ్చటించఁదలఁచ లేదు. ఏలనన, నీ మనంబు పాండవపక్షపాతము గావున, కొలఁదికాలములో జ్యేష్ఠ పుత్రశోక మనుభవించ వలసినవాడవు గావున సావధానుండ వయి వినుము.

గీ. సర్వగిరివనసాగరా ♦ శ్రయమునైన
పుడమి పాండవ కరములఁ ♦ బడినదయ్యా
క్షత్రియుఁడ నైన నే నెట్లు ♦ శాంతి జెంది
చూడ నోపుదు ప్రాభవ ♦ శూన్యునట్లు.

తండ్రీ! ధర్మజరాజసూయసందర్శనమే నాకొంపఁదీసినది. ఆయజ్ఞము చూచుటకయి, నానాదేశములనుండి రాజన్యశిఖామణులు, అనేకఁ పట్టణములనుండి కుబేరునిధిక్కరించువైశ్యులును, కృషీవలాఢ్యు లగు శూద్రులును, ఆత్మీయబంధుసుహృద్వీర సహితులయి వచ్చి సాంగముగాఁ గాంచి వ్యాసాదిముని బృందములతోఁగలసి నిండు పేరోలగంబున నిదివఱ కెవ్వరు నెన్నఁడు నిట్టి యజ్ఞము చూడ లేదనియు, ఎవ్వరు సేయనేలేదనియు, ఎన్నఁడో హరిశ్చంద్రుండు సేసినాఁడనియు, నాజన్మముగూడ దీనికి సమానము కాదనియు వేనోళ్ళం బొగడిరి, జనకా నీ వెఱుంగవు కాని—

ఉ. పాండవలక్ష్మికిన్ మనకుఁ ♦ బాపురె పోలిక యెక్కడయ్యా! బ్ర
హ్మాండము నిండిపోయెను మ♦హాత్ములు పార్థులవీరలక్ష్మి భీ
ముండు జరాతనూజు ననిఁ ♦ బోకడ బెట్టుటఁ గాంచి భీతిచే
గుండెలు వ్రేలి పాండవుల ♦ కుం బలి వెట్టఁగ వైరిభూపతుల్.

ఇప్పుడు పాండవులకుం గలప్రాభవము చూచినచోఁ గొలఁదికాలములో నాచేతఁగూడ సుంకము పుచ్చుకొనియెద రనియును. నీవత్సరము నుండియొక తేఁడయిన మనకుఁ బన్నిచ్చుదురు, పాండవు లియ్యనీ యరు. బాగుగా నుండదని యూరకుందురే? గాని, నీకును జెవులకుఁ దాటియాకులుగట్టి బొమ్మకట్టెదరనియును నాకుఁ దోఁచుచున్నది. మామయ్యా! క్షత్రియులకు రాజ్యము వీరభోజ్య మను మాట పాండవులకుఁ జెల్లినది గాని, నాబోటియనాథకుఁ జెల్లునా? పెక్కుమాటలేల?

ఉ. భావి పురాతనాద్యతన ♦ పార్థివలక్ష్మలు పాండవేయల
క్ష్మీవిభవంబుతోడ నుప♦మింప సమంబులుగావ శేషరా
జావళిలోన నత్యధికు ♦ లైన సపత్నుల పేర్మిఁజూచియే
చూవె సహింపనోపక కృ♦శుండ వివర్ణుఁడ నైతి నెంతయున్.

మామయ్యా! యొక్కసంగతి జ్ఞాపకము వచ్చినపుడెల్ల గుండె గుభేలు మనుచున్నది. తండ్రీ! నీవుకూడ సాకల్యముగా వినుము.

చ. మయసభ చూచితీరవలె ♦ మాయురె! రత్నమరీచిమాలికా
మయమయి కన్నుదోయికి ప్ర♦మాదము సేసెడు దానికాంతి ది
క్చయములఁ బాండవేయ ఘన♦శౌర్యయశోలత లల్లజేసె తం
డ్రి. యది లభించునే మనకు ♦ నేనును నీవును తల్లక్రిందుగా
నయి తపమాచరించిన న♦హోపది వేలసమంబు లీభువిన్

గురూత్తమా! పాండవేయుల సంపత్తులమేయములు. దిగ్విజయ సమార్జిత చిరత్న రత్నసముదాయములు వారి కొట్టులంబడి చూచివారు లేక కుప్పకుప్పలుగా గోడమూలలకుఁ ద్రోయఁబడినవి. అవిచూచి నాకన్నులు కుట్టి యింటికిఁ దెచ్చుకొనినఁ బలువురు విని పరిహాసింతురని యెంచి, పగతురసిరి యెట్లు లయినను పాడుచేయనెంచి చూచి, చూడక యనేకమంది యపాత్రులకు నారత్నములు గంపలకొలఁది నిచ్చివేసితిని! అప్పటికి నాకడుపుమంట తీరక, సంచులకొలఁది రత్నములు నాపరిచారికులచేత గంగలోఁ బారఁబోయించితి. తిరుగ

లేక వారి కాళ్ళుబలపములు కట్టిపోయినవి గాని యీ సంపదకు తరుగా విరుగా! మహానదిలో నీరంబులు పుడిసిళ్ళతోఁ బారఁజల్ల నెంచు నాదురాలోచనయే బయటఁబడినది. మామా! యింకొకసం గతి జ్ఞాపకము వచ్చినది. ఆధర్మరాజు యజ్ఞసమయమునఁ గొందఱు రాజులు కానుక లొసంగిరి. ఆవిభవము నాకుఁ జూపి నన్నుడికించ వలయునని యానలగొల్లని మాయాలోచనయే నా కా జన్మవిరోధియై గర్వపోతు, తిండిపోతునగు భీముని కుచ్చితపుటాలోచనయో గాని నాకు గొప్ప మర్యాదఁజేసినట్లు పదిమంది యనుకొనునట్లును నేను సంతసించునట్లును విదేశీయులగు రాజులు గొనివచ్చు కానుక పళ్లెరంబులు సోమయాజికి బదులు, నేను గ్రహించి కొట్టులంబడ వేయ నాప్రక్కను క్రిక్కిరిసియుండు సేవకావళి కందిచ్చుటయే నా పని నేనును చిన్నప్పటినుండియు సాముగరడీలు, కొద్దియోగొప్పయో గదాయుద్ధసాధనముచేసి తూరి తేరినవాఁడనే. నాబాహువు లుక్కు తునకలుగాని చచ్చుచేతులుగావు గదా! అట్టి నాబాహువులు, యజనసమాగత రాజలోకసమర్పిత పారిబర్హిక పళ్లెరంబు లందు మాత్రపుపనికే నాచేతులు కంది, కాయలు కాచి పచ్చిపుండ్లయి నవి. నాభుజములు తీపులుపుట్టుచున్నవి అట్టిసంపద కనులారఁజూచి క్షత్రియజాతిపురుషుఁ డూరకుండునా చెప్పు. బాబాయి. యింకొక్క సంగతిజ్ఞాపకమువచ్చినపుడెల్ల గుండె బ్రద్దలయిభీతి వొడముచున్నది.

శకుని—ఇది యా నీవిచారకారణము? ఇంతమాత్రపు కర్జనమునకేనా [illegible] పోయినట్లేడ్చుచుంటివి? ఎన్నివిధముల బతి [illegible] సంగతిఁ దెల[illegible]యక పోయితివే. ఇట్టివిచా రము నీకే కలిగిన దనుకొంటివా? క్షత్రిజాతియందుఁ బుట్టిన ప్రతి పౌరుషవంతునకు శాత్రవలక్ష్మి యసహ్యముగానుండక మానదు. పౌరుషముచేతనో యుపాయముచేతనో శత్రుసంపదనుకాలమూఁ డుగడియలలోపల నపహరింపవచ్చును. ఇంకనాకుఁ జెప్పనక్కరలేదు. బావగా రంగీకరించిన పాండవలక్ష్మి నీకుఁ దక్కినదనుకొనుము.

ధృత—(స్వగతము) వీఁడు దురాత్ముఁడు. కపటోపాయజీవితుఁడు. వీనిచే నాకులంబునకుఁ గీడుమూడును. వీనిమాటలు కుజ్జువానిని విననీయ్యఁ గూడదు. (ప్రకటముగా) నాయనా! పెదబాబు! నీవుకూడ నొక యాగము ప్రారంభింపుము. నీ యిష్టము వచ్చినట్లు దానము లొనరింపుము. రాజాధిరాజులు నీకు మాత్రము పారితోషికము లొసఁగరా? పాదాక్రాంతులుగారా? పాండవులపాటి యైశ్వర్యము నీకు లేదా? వారు నీకు విధేయులు, నీజన్మమున కెట్టికొఱంత రాకుండఁగాపాడగలరు. వెఱ్ఱితండ్రీ! నీకుఁగల సంపదతో ధర్మసూను సంపదయెన్నికకగునా ?

దురో—తండ్రీ! మీచిత్తవృత్తి నాకుఁ బరిపూర్ణముగాఁ దెలియును. నీమనంబు పాండవపక్షపాతము. నిన్ననకూడదు గాని, జనుషాంధుఁడవగు నీవుపాండవులక్ష్మినిఁ జూడఁజాలవు. తెలియదు. చూచినచో గడుపు చెరువు గానమానదు.

గీ. పౌరుషములేదు కాఁబట్టి ♦ బ్రతికినాఁడ
వీరుఁ డెవఁడైనఁ బ్రతుకునా ♦ పృథివిమీఁద
పాండవైశ్వర్య విస్తార ♦ వైభవంబు
కనులఁ జూచిన బ్రతికెడు ♦ ఘనుఁడు కలఁడె ?

తుదిగా నొక్కనిదర్శనముమాత్రము సెప్పి యీ కలాపము మాని ప్రాణ త్యాగమహోత్సవ మొనరించుకొనెద. ఆ రాజసూయ యాగకాలంబున యంత్రనిర్మాణ ఘటనాచణులచే నొక్కగంట భోజనశాలయందు కట్టఁబడియె. దాని చిత్ర మేమియో లక్ష బ్రాహ్మణ భోజన మయినతోడనే, దానికడుపుడక, టంగుమని యొక మ్రోఁత మ్రోగును. అట్టిది యా యాగసమారంభకాలము మొదలు సమాప్తి నొందుదనుక రాత్రిందివములుక్షణకాలమువ్యవధి లేక గణగణ గణ మ్రోగుచునే యున్నది. ఆమ్రోఁతవినినప్పుడు నాకుంగల పరితాప మెంతయని వర్ణింతును. బాబాయిగారు! పాండవాగ్రజుని కీర్తిచంద్రిక లోకాంత రంగంబుల వెలుంగఁ జేయుచున్నది. మరియు నా ధర్మాత్ముఁడు నిత్యమును నెనిమిదివేల

బ్రహ్మర్షివరులయిన బ్రాహ్మణ పరివారులఁ బ్రత్యేక ప్రత్యేక స్థానంబుల నిలిపి [illegible] సుప్రసిద్ధ దాసీల నొసంగి సకల విధంబులఁ బోషించుచున్న [illegible] పదివేల భూసురశిఖామణులకు బంగరు పళ్ళెంబులఁ [illegible] పెట్టును. మామయ్యా విధి చమత్కారము [illegible].

ఉ. దైవము [illegible] ♦ ధాత్రి కాలము నాకుఁ బోసెనా
నావిధసౌఖ్యసంపద ల ♦ నాకిటు కన్ భువి పాండునందనుల్
ద్రావిత వైభవంబు లయి ♦ ప్రాలుగ వారలఁ జూచి దేవెనై
చావఁగలేక నే బ్రతికి ♦ సౌఖ్యము నొందఁగ లేక కుళ్లెదన్.

ఈ కష్టపుం బ్రతుకిసి బ్రతుకఁజాల ఆ పాండవశౌర్యసంపదలు బ్రహ్మ రాక్షసునివలె నా వెంటఁబడి నా కనులు మిఱుమిట్లు గొలుపఁజేసి, నా దేహంబు దాహంబుఁ జేయుచున్నవి. ఈ యసహ్యాగ్ని నారక్త మును బీల్చి పిప్పిఁజేయుచున్నది. మధ్యమధ్య నాకు విస్మృతికలుగు చున్నది. నా ప్రాణ మెంగిలి పోవుచున్నది.

శకుని — రాజరాజ! కురోద్భవ సార్వభౌమ! నే నొక యుపాయంబుఁ జెప్పెద. ధర్మసుతనయుండు జూదంబునకుఁ బ్రియుండు కాని, యందుల యుక్తిపుం జెలంగఁడు నే నక్షవిద్యయం దతిదక్షుండ, కావున నశ్రమంబున వాని నోడించి తదీయ రాజ్య విభూతి నీకొసం గెద. దీనిచే నీకు గణుతిసాధ్యంబు ముసను శ్రమంబు లేదు. పౌరుష హానియు లేదు నీ సేనకుగాని నీకుగాని యావంత శ్రమయు హాని యుండదు. క్షత్రియులకు శత్రువుల రణమునం దోడించి సిరు లొడిచికొనుట లెట్టిలో దూఱ్యమన్న నట్టిదియె కావునఁ బాండ వుల నిపటికిం బిలిపింపుము, నా ప్రజ్ఞ కనుగొనుము.

దుర్యో—(తండ్రిపాదములు పట్టుకొని) జనకా! పాండుపుత్రులు మొద టినుండియు నాకు విరోధులే, విరోధుల విజయంబు వినియుఁ జూచియుఁ బౌరుషంబుగల రాజు మనఁజాలఁడు. ఏ యుపాయము చేతనయినను పగతురఁ బాఱు సేయుట మానముగల మగవానికి

మీాసరము. కావున మామయ్యా చెప్పిన చొప్పున నొప్పుకొనుము. నీ వెవిధంబుననైనఁ బాండవులఁ జూదంపు కొలువునకుం దింప కున్న నీడిక్కులేని పీనుగ గ్రిక్కున నీ పాదములపై బడి శిరంబు తెగవేసి కొనక మానఁడు. పెద్దకొడుకును జంపుకొనుటకు నీ కిష్టమో, పాండవులఁ గాపాడుకొనుట నీయభిప్రాయమో చక్కఁగ నాలోచించు కొనుము. ఇష్టానిష్టములఁ దెలుపుము.

ధృత—నాయనా! దుర్యోధనా! యిపుడు వేవురు శిల్పాచార్యుల రావించి కలధౌత స్తంభసహస్రమండితంబును, విచిత్రద్వార దేశంబును, వివిధ మణిఘృణి ప్రభా భాసితంబును, రమ్యతరంబు నయిన యపూర్వ సభాభవనంబు మూఁడునాళ్ళపట్టపగలున నిర్మించ నాజ్ఞాపించెద. మఱియు నీ కింకొక రహస్యంబు సెప్పెద. మనరాజ్యంబు మొదటి నుండియు నేను గ్రుడ్డినగుటచే,నాతండ్రినాఁటినుండియు భీష్మబాహు బలముచేతను, నీతిశాస్త్ర రహస్యంబుల వాచస్పతి నటుండుమన విదురుని బుద్ధికుశలతచేతను రాజ్యతంత్రంబు ప్రవర్తిల్లుచున్నది. కావున విదురుని రావించి నీ యభిప్రాయంబుఁ దెలిపి యాతని యను మతంబున నెగడుటచే లగ్గగునని నా యభిప్రాయము. ఇది నీకును మంచిదియే.

దుర్యో—మామయ్యా! యీా చీకు పుత్ర ప్రేమ వదలినాఁడు నాయభి వృద్ధి వీని కనభిమతమే. కావున నీ వర్తమానము తండ్రికిఁ దెలియ కుండనే ప్రాణము వీడెదనని నీతో మొఱఁబెట్టుకొంటిని తండ్రీ.

గీ. కొఱవితోడను తలగోకి ♦ కొనినయటుల
విదురుతోడను యోచన ♦ కుదురునయ్యా
పాండుపుత్రుల కెప్పుడు ♦ పక్షపాతి
శకునికైతవ మతనికి ♦ సమ్మతంబె.

తండ్రి: పెక్కుమాటలేల ?

చ. తనయులు నూర్వురుండి రిలఁ ♦ దక్కువె నేనొకఁడన్ నశించినన్
మన మలరంగఁ బాండుసుత ♦ మండలితోడను నూటనల్వురే

తనయు లటంచు నీమది ము*దంబును బొందుచు భూమి హాయిగాఁ
మనగదవయ్య తండ్రి గతి * మాలినపుత్రుఁడు చచ్చునిప్డడే.

ఓ సర్వభక్షకా! యొక్కసారిగా నీవు నన్నుఁ దగులఁబెట్టలేవా? ఓ భూదేవి! నీ వయిన నీకష్టుని లోనికిం గొనిపోవరాద! (అని తలనేలఁ గొట్టుకొనవలయును)

ధృత—(చెయ్యి చాచి పట్టుకొని) నీకన్న నాకు లోకములు, పాండవులును నెక్కడా? నాయనా! యే కార్యమయినను విమర్శింపక వైళంబ సేయకూడదు. అట్టివాఁ డిక్కట్టులకు మూలమగును. పాండవసభకన్న వేయిరెట్లు సిరిసంపత్తులు గల సభాభవనము నీకు గట్టించెద. వేలోకయాగము చేయించెద. పాండవులఁ బిలిపించెద. కాలాను కూల్యము ననుసరించి కార్యనిర్వాహకమగు మార్గము యోజించెదము. బలవంతముగా ప్రాణముఁ దీసికొని యేమి చేసెదవు?

దుర్యో—తండ్రీ! యేమి చేసెదనా? బలవన్మరణమునొందుటచే బిశాచ జన్మవచ్చునని మన శాస్త్రము లుద్ఘోషించుచున్నవి. కావునబిశాచమునై ద్రౌపదిని బట్టి పీల్చి పిప్పిచేసి పాండవుల బిచ్చగాండ్రఁజేసి యొకరిమాట లొకరికిఁ గానీయకుండఁజేసెద. నాకీసభ యక్కఱ పట్టదు; నాన్నగారు! మయసభలో నాకు జరిగిన పరాభవములు లెక్కలేవు. తొందరనొందకుమని చెప్పు మీ యుపదేశములు పాండవులకు నేరుజేయు నపకారములవలె వ్యర్థము గుచున్నవి. మయసభ నా కనులముందఱ నిలచియున్నది. అచ్చటి శబ్దములు నాచెవులలో నిండియున్నవి ప్రపంచమంతయు [illegible] లకు మయ సభవలెఁ, ధ్వనులన్నియు నచటి ధ్వనులవలె, బా[illegible] వాలీపరిహాస స్మేర రవంబువలె వినఁబడుచున్నది. ఇటు వినుము. యజ్ఞ మయిన పిమ్మట సభావైభవములఁ జూచినను తనివితీరక యొక్కనాఁడేను ఒంటరిగాఁ బ్రవేశించి బరిశీలింప సమకట్టి [illegible] ల [illegible] ఒక వ[illegible]డిచి నే నాసభాభవనము ప్రవేశించితి. ఇం[illegible] నేపడినపాటు లా[illegible]వమున కెరుక. ఒక గృహంబున నలుమూలలను విస్తృత ద్వారంబుల కెదురుగా నంతియ పొడవును వెడల్పును గల దర్ప

ణంబు లమర్పఁబడియున్నవి. కొన్నిస నచ్చట దర్పణప్రతిబిం
బిత ద్వారంబులు గమన ద్వారంబులుగాఁ దలంచి యనం
తర గృహనిర్మిత చిత్ర దర్శనార్థము శైలంబుగాఁ జనంబో
యితి. అప్పు డాస్ఫటికపు కట్టడమునఁ దళుకులు గులుకు పలకలు
దీరిన యద్దపుకమ్మి నానుదుటికి టంగునఁ గొట్టుకొని, బాబుగారు!
చెయ్యి యేది! యిటు చాచుడీ (అని చేతినిఁ బట్టుకొని) పెద్దయుసిరిక
కాయవలె బొబ్బకట్టినది. ఆ దెబ్బతినినతోడనే తల గిర్రునఁ దిరిగి
కనులవెంట బొటబొట నీళ్ళుపడినవి అప్పుడు నాలుగు మూలల
నుండి యే దాసీ తొత్తులు చూడలేదుగదా యని తిరిగితిరిగి వెనుక
చూచుకొనుచు మొగమునఁగల బొప్పిపరులుచూడకుండఁ గిరీటము
ముందరికి మాటుచేసికొని బ్రతుకు జీవుఁడా యనుకొని అవతల
బడితిని. అంతటితో వెనుకకు రాలేదు! నాబుద్ధి పూరిమేసి ఇంకొక
స్థలమునకుఁ జూడఁబోయితి. మహారాజా! యక్కడిపరాభవము చెప్పఁ
జాలను. తలఁచిన నిప్పుడే నవ్వు వచ్చుచున్నది. ఏమన నచ్చటి విశాల
ప్రదేశము శాణనికషణమ్మిన మొనగుంగులుదీరు చలువరేరాపలకలు
పరచివానిపయిస్వచ్ఛమ్మగు నీరమమ్మవిడిచి కృత్రిమసరోవరము నిర్మిం
చిరి. దానికినలువైపులతరఁగలపట్టి పలకలుదీర్చిన స్ఫటికపురాతిగోడలు
కట్టి పాలితశిలాతలమమ్మల గారుత్మత, పద్మరాగ, వైడూర్య, గోమే
ధికాదుల జలచరంబుల శిల్పకారులు, జీవప్రతిమలవలె నిర్మించి కుహ
నాపద్మినీ లతలవారిగా చిత్రించిరి. ఆగోడల ఛాయలన్ని మానీటి
మీఁద బ్రతిఫలించి మెట్టపదికమునవలె [illegible] చేసి నటియుండుఁ
బ్రతిబింబితమగు కృత్రిమసారవిందము స్థలారవిందముగాఁ దలఁచి
దాని నిర్మాణ చమత్కారము గాంచ బోయి కట్టుబట్టలతో నీట
దిగఁబడితిని. అప్పుడు నాకెంతటి [illegible] యయ్యెనో విచారిం
చుము. అప్పటికే నగవుచచ్చి [illegible] మీ పెద్దతో
డలు, మహాసాధ్వియని మీరు [illegible] ద్రౌపది
యేమూలనుండియో [illegible] సంహాసంబునై
గూర్చుండి, అయ్యగారు పడినారని [illegible] యని యొ

కర్త, యుయ్యాలనుండి యొకరిత బాబు, బాబు అని మఱియొక ర్తక
ధృతరాష్ట్ర మహారాజుగారి కుమారులుగారు వీరే యని యొకరిత,
పకపక నవ్వి చప్పట్లు కొట్టిరి. ఇంతలో నన్నొకదార్చి మర్యాద
జేయవచ్చినట్లు సహదేవుఁడు పరిచారికలచే మకరాలంబుల మోయిం
చుకొని నేను నీటినుంచి లేచునప్పటికే యేమూలనుండియో వచ్చి
సిద్ధముగానుండెను. పరిచారికలు తడి బట్టలువిప్పి పట్టుబట్టలు కట్టు
కొనుండు, అయ్యా! త్రోవయిది, త్రోవయిది, ఇటుఇటు అని
ముందు త్రోవఁ జూపుచు సహదేవుఁ డొకచెంపను, పరిచారికుఁ
డొకచెంపను గేలిచేయుచు సభాభవనముఁ జేర్చిరి. ఇంక నాగతి
చెప్పందరమా?

ఉ. ఇట్టిపరాభవం బెటు సహించియునంగలవాఁడ రాజనై
పుట్టి పరాక్రమస్ఫురణ మోమునఁ దెల్పెడు మీసముండి చేఁ
బట్టితి నాయుధంబు మగవాఁడను కా దొకొ, పౌరుషంబనా
చట్టయిపోవ నీగతిని నావక యుందున తండ్రి! చెప్పుమా.

ఎంతపతివ్రతయైన, అయిదుగురు మగల వరించనను నిర్భయ మింత
పనికిరాదు. అంతఃపుర స్త్రీలచేఁ బరాభవింపఁబడు రారాజు బ్రతికి
ప్రతిక్రియఁ జేయకుండునా! యోచింపుము.

శకుని — అబ్బాయి, నీకు దుఃఖము కలుగవచ్చునుగాని ఇంతదిగులుపడి
వెలిపుచ్చరాదు. మనస్తాపము, వంచనయు, పరాభవము, గృహ
దుశ్ఛిద్రము, పరులకుఁ దెలియఁజేయరాదందురు. పాండవులఁ బిలు
పించెద నని మీతండ్రి చెప్పినాఁడు. వచ్చినప్పుడు జూదప్రక్రియచే
నాతని తప్పక యోడించవచ్చును. నీతండ్రి నిన్ను వృద్ధిఁ జేయ
కుండునా? విదురుఁడు పాండవపక్షపాతి యయినను మీజనకుని
యాజ్ఞఁ దిరస్కరింపఁడు. పదేపదే పరిదేవనము పనికిరాదు. నీజనకుని
కన్న నీయోగక్షేమములు విచారించువాఁ డొకఁడుండునా? కావున
నూతనసభాభవన విలోకనకుతూహలంబునఁ బాండవు లరుదెంచె
దరు. ధైర్య మవలంబించుము. నీమనోగతంబుఁ గనిపెట్టవలయునని
పలుకుపలుకులకీ వులుకుచు నంటివిగాని వీరవరు లలయుచుంతనాయు

ధము చేతఁబట్టక, కదనరంగము తొంగియైనఁ జూడనవసరములేక, పాచికలు చేపట్టి యీశకుని యస్త్రశమంబునఁ బరమహీపతుల సంపదలు జయించి నీకిచ్చుచుండ బావగారు వద్దనునా? ఇంటికిఁబోయి భుజించుము, పొమ్ము.

ధృత——నాయనా! యిప్పటికిఁబోయి భుజించిరమ్ము. నేను వేవురశిల్పుల రావించి చిత్రసభాభవననిర్మాణం బొనరించెద. ప్రీతిగా మీ విదురుని పిలచికొనిరమ్ము.

(దుర్యోధనుఁడు, శకుని నిష్క్రమించుచున్నారు.)

విదు——(ప్రవేశించి) ధృతరాష్ట్రునకు ప్రభువునకు విదురుఁడు దాస్యుఁడు దండము లిడుచున్నాఁడు. (అని నమస్కరించవలయును.)

ధృత——శుభం బగుగాత. నాయనా! యిటు గూర్చుండుము. మొదటి నుండి నేను గ్రుడ్డినయినను, భీష్మపరాక్రమమును నీ నీతివిద్యానిపుణతయును నేత్రములుగాఁగొని రాజనామము ధరించియుంటిని గాని రాజ్యలక్ష్మియొక్క వృద్ధిక్షయములు లాభాలాభములు కీర్త్యపకీర్తులు మీవలననే లోకంబున నిలిచి, విఖ్యాతి గాచియుంటిని. మీ యిరువురిలో భీష్ముఁడు కేవలము జయలక్ష్మికై న్యాయంబుగా ఖడ్గంబు నడుపువాఁడే గాని, మిగిలిన యుపాయతంత్రములచే వైరివీరలక్ష్మిని హరించు మార్గంబు నీవలె యోచింపఁజాలఁడు. కావున నా రాజ్యాభివృద్ధియు, నాసంతోషము, నాకుటుంబాభ్యుదయము సర్వదా విచారించు నీతోడ మంత్రంబు సలుపక, [illegible]యేకార్యముఁ జేయఁజాలను. కావున నీ వొక కార్యము గమనింపవలసియున్నది. మనకుఱ్ఱవాఁడు మొదటినుండియుఁ బాండవులకు నసూయగలవాఁడు రాజునకుఁ బరరాష్ట్రహరణంబ ధర్మమై, చ అమాయకులు వీరసింహులు నగుపాండవులయం దది కూడనిప ని. ఏవారికిగాని నైజగుణంబు విడచుట దుర్లభంబు. వానికిఁ దోడు మాయలమారి శకుని వానికి జతపడినవాఁడు. వీరిరువురి మ గాలమున మన వంశమున కపఖ్యాతి తప్పక రాగలదు. ఇంకఁ గర్ణకీటకము వంశ

భూరుహముయొక్క తల్లి వేరును క్రమముగాఁ గొట్టుట మానివే
యఁజాలదు. సర్వము దైవాధీనమనియే నమ్మియున్నాను. మఱి
సభావలోకనము మనపెద్దవానికిఁ బిచ్చిపుట్టించినది. కావున, నట్టి
సభాభవనము నిర్మించుటకై శిల్పుల కాజ్ఞనిచ్చితిని. చిత్రకారు
లపూర్వవైభములతో నిర్మించిరి. దాని గృహప్రవేశము సలుపు
నపుడు పాండవులతో సహ సమస్త బంధువర్గమును రావించఁ
దలఁచితిని. ఆనిండు పేరోలగంబునఁ బాండవాగ్రజుం డక్షవిద్యాప్ర
వీణుఁడు గావునఁ గొంత ద్యూత్యకళావైశద్యము, మేనమామతోఁ
గూడి సార్వభౌముం డనుభవింపఁదలఁచినాఁడు. కావున నీ వా పాం
డునందనులపాలికిఁ జని నా యాదేశంబుగా వారి నిటకుఁ దోడ్కొని
రావలయు. యోచించుము.

విదు—మహారాజా! ఈ విషయ మంతగాఁ దమతో నొక్కి చెప్పఁ
దగదు, ధర్మవేత్తలు పలువిధముల యోచించి భావికాలగతుల నిరీ
క్షించి కలిద్వాపరసమాగమసమయము గావునఁ బ్రజాక్షయంబగు
నని నిశ్చయించిరి. ఇట్టికార్యంబునకేను నిశ్చయముగా నొడంబడనని
మీకుఁ దెలియనియంశము కాదు. నీకుమారునితోఁ బాండునంద
నులకు వైరంబు కల్పించుట న్యాయ మగునా? నీ పుత్రులెల్లరు.
నొండొరులతోఁ గలసిమెలసి యుండు వెర వాలోచింపుము.
జూదంబు వాదహేతువు, వాదమా, యెట్టిశాంతివాదుల నయినను
కలహరంగము లోనికి దింపి తందనాలాడించక మానదు. కావున
నీబుద్ధికుశలత నుపయోగించి శకుని దుర్యోధనుల దుర్వ్యవసా
యము మానుపించి, కురువంశ రక్షణోపాయధురంధరుండ వగుము
వృక్షనాశనమునకు వేరుపురు వాధారమైన ట్లీజూదపుపురువు నీ వంశ
వృక్షము నశింపజేయు టకు ముఖ్య హేతువు కాకమానదు.
పాండవుల జూదంపుమిషచేత నోడించి, యేదయినఁ బన్నుగడఁబన్ని
ద్రౌపదికిఁ పరాభవము సేయువయునని నీ కుమారుని ముఖ్యాభి
ప్రాయము. మహాసాధ్వి యగు, కృష్ణాదురంత దుఃఖతపనచ్ఛవి
కౌరవమద గాఢాంధకారంబు పటాపంచెలు గావింపకమానదు.
మీ మనంబున యోచించుకొని, మీ యెత్తుగడకు లోబడుఁడు.

ధృత—వినయవిదురా! విదుర! నీ మానసిం బత్యంత మృదులంబగు టను, ధర్మనందనాదుల యమాయావృత్తి బాగుగా నెఱింగినవాఁడ వగుటను, నీమనంబు చిరికివడినది. పోనిమ్ము. భీష్ముండును, నీవును మనస్ఫూర్తిగ నంగీకరించనిది యీ కార్యము నసహ్యతరము. కాని యేనాఁడు నా తమ్ముఁడు కానసంబుల కాపోవలసినవాఁడాయెనో యప్పటినుండియు గసిగంపుల బెంచితిఁగదా? వానిలో మహాశూరుం డగు పెద్దబ్బనిఁజూచి యెన్నోదినములాయె. వానిమాటలే వేరు. మిత్రమా! నిజముగాఁ గడుపు తీపిచేత నేనే విదిలించిన దుర్యోధ నుఁడు, చిన్న వచ్చుకొను నేమోయని వెలుపరించను గాని, మా పెద్దవాఁడు నాయందుఁ జూపు వినయంబునఁ గీసరపాలు వీఁడెన్నఁ డుసూపియేఉుఁగఁడు. అట్టి ధర్మజుఁడు లేనిది నా సభాప్రవేశము చేయుదునా? చెప్పుము. సుహృద్భ్రాతృత్వమైనను పోవుఁగు పోవుఁగు నని నీకు దోఁచినను, సభాసదుల యభిప్రాయము తెలియక యున్నను నేనుమాత్రమంత యజ్ఞానినా? బిడ్డలకు కలహము పెంచుదునా? అట్లుచేసిన నలుగురిలో పరీవాదము రాదా? అట్టి యకృత్యము జరుగదు. నీ వేయభ్యంతరములను జెప్పక, యిప్పుడే యింద్రప్రస్థము నకుం బయనమగుము.

విదు—ప్రభువులకు సేవకుఁడు విన్నవించువాఁడేగాని కార్యసిద్ధాంత మొనరింపనధికారి కాఁడు, కాని నిక్కముగు మిత్రభావము సూచించు వాఁడు మనంబునఁ గల సంశయము దాఁచుకొనఁజాలఁడు అయ్యది ప్రభువులను రంజింపఁజేయుటకుఁ బ్రకృతము సముచితము కాకపోయి నను. కార్యావసానఫలితములయందు యథార్థవాదిమాటలు జ్ఞాపకము రాకపోదు. ద్యూతరంగమునఁ బాండుపుత్రులఁ బరిభవపెట్టుటచే బ్రకృతము వారి సంపదలు నీ పుత్రుల నాశ్రయించినను విషము మ్రింగినవానికిం గడుపున వికారము గలిగించి, తోఁబుట్టిన ప్రాణములఁ గూడ వెడలఁ గ్రక్కించినట్లు తను మనఃప్రాణముల వెడలింపక మానవు. ఇది నిశ్చయము. ఈ యపఖ్యాతి నెపుడుఁ దప్పదు.

ధృత—మిత్రరత్నమా! నీతిసుధాలిప్తంబులగు నీ వాక్యములు కమలారా తికరంబులు మామకవిచార తమఃపటలవిపాటన పాటనంబులయినవి. దుష్టద్యూతమైన నుపద్రవనిదాన మనుటకు సందియమా? కులవృద్ధుఁడును, వీరసింహుఁడును, భీష్ముండను నగు గంగానందనుండును, బృహస్పతి నటుండమను నీతిసుధాసంకలిత వచనరచనాచణుండవగు నీవును, నేనును, ద్రోణాదులు నైనఁ జూచుచుండఁ బుత్త్రుల కన్యోన్యము భేదము, అహితము, అకార్యము జరుగునా? ఇదియునుంగాక మనయెడల, వేల్పులు ప్రసాద బుద్ధులు, వారు కంటికి రెప్పవలె మనలఁ దప్పక కాపాడఁగలరు. సుహృద్ద్యూతంబున విపదుత్పత్తియగునని శంకించుట నామతంబుగాదు. కావున దీనికి నొడంబడుము.

విదు—మహాప్రభూ! సుహృద్ద్యూతమని లోకంబునఁ గలదా? మాయానిలయుండగు శకుని కైతవము, మనకుఁ గొత్తదియా? చిన్నప్పటి నుండియు నీచేతిమీఁదుగఁ బెంచిపెట్టినవానిఁ జేసి, రాజ్యదాయమునకై పరస్పరకల్లోలమునందు నీకుమారుని దుర్వ్యవసాయము మొదటి నుండియు నీకుఁ గరతలామలకమై యుండియు, వాని మాటలకు లోఁబడి, ధర్మాత్ములగు పాండవుల నిట్టి యకృత్యములకుఁ జొనుపుటకై నీవే ప్రయత్నింపఁ నీకే నేటిండ్రి పుత్త్రులకు విషము వోయకుండు! మహాసేన, మహాభిష, శూరసేనులనాఁటి నుండియు నీవంశమున స్థిరముగఁ బాదుకొల్పిన కీర్తిభూరుహమును నేఁటికి నీ పుత్త్రుని కుమానాప్రవర్తనకు లోనై, నీచేతిమీఁదుగ నశింపఁజేయకుము. కుచ్చితముగాఁ బాండవుల సంపదలు హరింపఁ జూచిన..బలవద్విరోధము చేటునకు మూలము. మద్యపానము మనుజుని యకృత్యములలోనికి, ద్రోయునటుల. దూత్యము నీ వలమును రెట్టింపఁజేసి, యాశామాత్సర్యాదులఁ బెంచి, యెట్టి స్నేహితునైనను వైషమ్యపరివాహమునముంచి చేటుమూడఁజేయును. ఇంతకుఁ బాండవుల యభ్యున్నతి నీ కుమారుఁ డోర్వలేనివాఁడని నీకుస్పష్టమేకద. ఇదియునుగాక యింకొక రహస్యముఁ జెప్పెద. పాండునందన సంప

దలకంటె నీ పెద్దకుమారునకు మనస్తాపము గలిగించునది ద్రౌపది యందలి వ్యామోహముఁ మఱియు నామె యందు నీర్ష్యయుఁ గలదు. మయసభయందు ద్రౌపది పరాభవించిన దను వ్యర్థకోప ముచే నీయాజ్ఞ నెఱవేర్చెద, ముదల నొసఁగుడు. ఇదుగో విదురుఁడు దండము లిడుచున్నాఁడు.

(అని నమస్కరించి నిష్క్రమించును.)

ధృత—విదురునకు మనస్తాపము గలిగినది. అది మన కష్టమే. కావున నూతనసభను చూచుటకై రారాజును పిలిపించి ద్యూతంబు తగదని మందలించెద. ప్రాతిగామీ;

ప్రాతి—చిత్తము. అయ్యా! (అని సమీపించవలయును.)

ధృత—అంతఃపురమునకు మార్గము!

ప్రాతి—ముదల. (అని చెయ్యి పట్టుకొని ధృతరాష్ట్రుని లేవఁదీయు చుండఁగా తెర వేయవలయును.)

## రా జ మా ర్గ ము

(విదురుఁడు ప్రయాణవేషముతో మార్గమునఁ బ్రవేశించి తనలోఁ గొంచెము విచారము మోమున సూచించుచు)

నా ప్రయాణము బొత్తుగా బాగుగా లేదని ధృతరాష్ట్రుఁ డీయెత్తుకోలు నెడుపుల సర్వానభిమతమని భీష్ముఁడు మున్నగువారు స్పష్టముగా వ్రాకుచ్చినారు. దైవయోగమున నేనే స్వయముగా వారిని విపదం భోనిధిన్ ముంచుటకై తీసికొని రావలసివచ్చినది. ధర్మరా జమాయకుఁడు. నీతిసర్వాహకుఁడు. పెద్దల యాజ్ఞయనియో, ద్యూత్యము క్షత్రియ ధర్మమనియో, నేను స్వయముగాఁ బిలువ వచ్చితిననియో రాకతప్పడు. తమ్ములు వీరులు, బలవంతులు, లోకవృత్తంబుల బాగుగా నెఱింగినవారలే కాని వారు నలువురు సోదరాజ్ఞాలానబద్ధులు, అయ్యది లోకమునందుఁ బ్రఖ్యాతిఁ దెచ్చును గాని ప్రకృతము వారి నిడుమలపాలుసేయును.

చ. హరి హరి యెంతపాపము మ॥హా ప్రభుపాండుకుమారు లీయెడన్
దురిత మెఱుంగ రా ఘనుల ॥ ద్రోహము సేయఁగ ధార్తరాష్ట్రుడే
దొరకొనెఁ దండ్రి యొప్పుకొనె ॥ దోస మెసోవనుఁ జట్టియుంట స
చ్చరితులఁ దెచ్చి దుఃఖగురు॥సాగరమగ్నులఁ జేయనైతి హా !

ధర్మమే జయమని శాస్త్రమే నుడువుటకాదు. ఈ యుగంబునఁగొలదిఁ కాలముక్రిందటనే మన కనేక నిదర్శనములఁ జూపింప నవతరించిన కృష్ణుండు పాండవ పక్షపాతి. కంసుఁడు మొట్టమొదటఁ గృష్ణమూర్తి జంప నుద్దేశించి పరమభక్తుండగు నక్రూరుని కృష్ణునికడకు దూతఁగాఁ బంచినట్లుగా నాగతియు భగవదవతారాంతరమని లోకములఁ బ్రఖ్యాతి గాంచిన నరుని యాతని కుటుంబమును దీసికొనివచ్చుటకు నేనాయితని కంటి కగుపడితి ? ఏరినైనఁ బంప గూడదా ? నాగ్రహాచారము చాలక యిట్టిపని నాకు సంప్రాప్తమైనది. (యోచించి) ఒకవేళఁ గృష్ణాగమనంబు కంసవధకుఁ గారణమైనట్లు పాండవాగమనంబు విపరీతప్రయోజనముగా మారిపోయి కౌరవకుల వినాశకారణము కాదుగద ? దూత్యమే ప్రారంభింపఁబడిన, నిప్పుడే కాకపోయినను కాలాంతరమందైన నీ విషబీజము కౌరవవంశ నాశననిదానము కాకమానదు. దానికిఁబరమేశ్వరుండు నాచేత నించుకంత దోహదము చేయించుచున్నాఁడు. కృష్ణా ! సర్వము నీదివ్యకళామయము. నీయధీనము.

(అని ప్రార్థన సేయుచు నిష్క్రమించును.)

# ద్రౌపదీవస్త్రాపహరణము

## చతుర్థాంకము

(ధర్మరాజు, సోదరులు, ద్రౌపది, విదురుఁడు)

విదు — మీ తండ్రిగారు మీక్షేమాభివృద్ధి విచారించి, మీ వలన నొండొక కార్యమపేక్షించి, మిమ్ములఁ జూడఁగోరినన్నుఁ బుత్తెంచె. ఇందులకుం దగిన యుత్తర మొసంగుము.

ధర్మ — నేఁడు మిక్కిలి సుదినము. మీరు మాకుఁ బ్రాణదాతలు. శకునిచే కపటానాబిల నిర్మాణము గావించి, మహాబలశాలియగు భీముని కేతిగించనిచో మాజీవితములానాఁడే సమాప్తి నొందవలసినవి గదా? కౌరవులు, మే మీపరసలంబుల నుండుట వారిచే నిష్కాసితుల మైన వారిగాఁ దలఁచి సంతసించుచున్నను, ప్రతిక్షణాపాయజీవితములగు ప్రదేశములనుండి తొలఁగి వచ్చినందులకు మిగుల సంతసించుచు, మమ్మింత వృద్ధిలోనికిఁ దెచ్చిన పెదనాన్నగారి దర్శనము, నిత్యము నాకు లేకపోవుటకుఁ జింతించుచుంటిని. ఎనాఁ డేయడవుల నా తండ్రి మృతినొందెనో బుద్ధి తెలిసినపిమ్మట నీకొమరులు, పితృబాహుద్వయ సమాలింగిత సౌఖ్య మనుభవించి యెఱుఁగవుగదా? అట్టి కొఱంత మాకుఁ గలుగకుండ, మన ప్రభూవరుండు నిత్యము తన మృదుకోమల పల్లవసమానంబులగు కరంబుల మా మేనులు స్పృశించి, మమ్మానందసాగర వీచికలనూగులాడించు చుండును. అట్టి మా తండ్రి భార్యతోఁగూడ క్షేమంబుగ నున్నవాఁడుగదా?

విదు — పాండవాగ్రజా! నీజనకుండు, సాధ్వీతిలకంబగు గాంధారితో క్షేమంబుగనున్నవాఁడు. నీపయి ననురాగంబు మనంబున నంకురించుచునే యుండును. ఆ యనురాగాంకురము దుష్టస్వభావులగు కౌరవ కుమానా ఘనాంతరంబులఁ జిక్కి వృద్ధి కానేరదు. భావికలత్రంబు లీ

యుగంబుననే మొలకలెత్తినవి. అందు దుర్యోధన విషాంకూరము శతశాఖాప్రవిస్తరమై, తలలెత్తి విశాలచ్ఛందంబుల సేకరించుచున్నది. ఇతకన్నఁ జెప్పందగినవిషయము లేదు. మీ పెదతండ్రి సర్వదా నీ క్షేమము విచారించుచుండును. పరిష్కృతము, మయసభాప్రతిబింబితమయిన సభాగృహంబు, దేశీయశిల్పికారులచేఁ కట్టించి యందు గృహప్రవేశమహోత్సవము సేయఁబోవుచు, నిన్ను సకుటుంబముగాఁ దీసికొనిరా నను మీ తండ్రి పంపినాఁడు మఱియు, పెద్దబ్బ లేనిది యేకార్యము చేయుటకు నామనం బొడంబడదని చీకురాజు వాకుచ్చియున్నాఁడు. వాని యభిమతంబు నెఱవేర్చుట మనకందరికి విధియని వేరుగ నీ వంటివానిముందర ప్రశంసింప నక్కఱపట్టదు. ప్రయాణంబున కాయతంబయ్యెదవో? సోదరులతో విచారించి యొండు ప్రత్యుత్తరం బొసంగెదవో ? కాలాతిక్రమణంబు గాకుండఁ జెప్పుము.

ధర్మ—అయ్యా ! నా యోగక్షేమము విచారించు పెద్దనాన్నగారాజ్ఞ యిచ్చుట, తా మీ కార్యంబున కరుదెంచుట, యీ వేద శిరసావహించి చేయకపోవుటయు కలుగునా ? అతిశీఘ్రంబున నిట్టిసభాభవన మచ్చట దిరుగఁగల్పించుట కేమికతంబొ ?

భీము—అన్నగారన్ని విషయముల వాచస్పతిసమాన శేముషీవిశేషులరే. కాని; అత్యంతనిర్మలమనస్కులరౌట నరనిర్మితాగాధోదంబునఁ గూలుట సంప్రాప్తంబగును. నిశ్చయముగా నీ విషయము సహదేవుఁడు మీరు యోజించియే తీరవలయు.

ఉ. చిన్నటనాటినుండియు మముఁ ♦ బెట్టినతిప్పలు చాల కిప్డు దే
పన్నుగడన్ దురాత్ములట ♦ వంచనసేయఁగ బిల్వనంపి రో
యన్న నయప్రధానహృద ♦ యంబు ధరాస్థలి సర్వసౌఖ్యసం
పన్ననిఁ జేయు నా రిపుల♦భావముఁ గాంచి చరింపకున్నచోన్.

విదు—ధర్మాత్మజా ! మఱియు నింకొక్కవిశేషము కద్దు, ఆ నూతన సభామంటపంబున నీవును ధార్తరాష్ట్రులును కొంతతడవు ద్యూత

వ్యాపారము నడుప, మీ తండ్రి చూచి, యానందింప నెంచియు న్నాడు. నీ సోదరులును, నీవును చక్కఁగ నాలోచించుకొని నా కుత్తరం బొసంగుడు.

భీము — యోజన సేయ నేమి యున్నది ?

గీ. పాండుపుత్రులు భూమిపై ♦ బ్రతుకనేల
ఖ్యాతిఁ గన నేల విజయంబు ♦ గాంచ నేల
ననెడు క్రోధంబు మదిలోన ♦ నునుచుకొనియె
మనల వంచింప రారాజు ♦ పనిచె నధిప !

దాని కాగ్రుడ్డియు పయోముఖవిషకుంభమువలె నటింపుచున్నాఁడు మన ప్రాణంబులపై నున్న పగవానిని జీవింపనిచ్చుట ధర్మవిరుద్ధమని యెఱుంగనిది కాదు కావున నీ ప్రయాణమును దుర్యోధనాదుల ప్రాణాంతకరమని నా యభిప్రాయము.

సహ — అన్నయ్యా! ధార్తరాష్ట్రులు దురాలోచన సేయనిండు. పాండ వాగ్రజుండు ధర్మముతప్పువాఁడుకాడు. లోకము ధర్మాధిష్ఠితంబై యున్నది. ధర్మము జయాస్పదంబు. కుహనాస్వభావులు క్షణకా కాలము మంచువలె మెఱసినను స్థిరంబగు తేజంబు వారియందు నిలువంబోదు. మఱియు మనల సంరక్షించుటయందు సర్వదా కృష్ణుండు కంకణము గట్టుకొనియున్నాఁడు. కాలనిరీక్షణ మాచ రించిన సర్వకార్యములు నెఱవేఱఁగలవు. దాయలచేఁ బిలువంబడి ద్యూతంబునకుఁ జనకుండుట యుత్తమ క్షత్రియులకు పౌరుషము కాదు. పౌరుషమే ప్రధానముగ జీవించు పగవాని మనుగడయే మనుగడ. మనలకుఁ బ్రాణదాత యయిన విదురుఁడీ విషయము చక్కగా యోచింపనిదే యీ కార్యభారము వహింపఁడు. కావున శాంతవృత్తితో బ్రయాణము సేయుట యావశ్యకము.

ధర్మ — నూతనసభాభవనము చూపుటకై మాతండ్రిగారు మమ్ములఁ బిలిపించుట న్యాయమె. కాని మేమును నిజనందనులును జూదంపు

కొలువులోనికిం జేరుట కాతఁ డిష్టపడునా? మంచిది. అందు మాతో ద్యూతవ్యాపారము నడుపు నేర్పు నెవరు గలరు?

విదు—ధర్మాత్మజా! వృద్ధరాజు స్వభావము, మనోదార్ఢ్యము నీ వెఱుగని వాఁడవు కావు. దాని కింతకన్నఁ బ్రత్యుత్తర మొసంగ రాదు. అక్షకార్య నిపుణులగు వారా సభయందు విహరింతురు. చిత్రసేనుఁడు మొదలగువారలు పెక్కురు గలరు. వీర లేల? రారాజు నకు మేనమామయగు శకుని మాయాద్యూతమునం దందెవేసిన చేయియని నీవెఱుంగనిదికాదు. కాలయాపన సేయక తండ్రిగారిని, దేశమును సోదరుల యభిప్రాయమును చూచికొని నీ యిష్టము గలిగిన బయలుదేరుము కాదేని వేఱొండు ప్రత్యుత్తర మొసంగుము. అవు గాములు తెలుపుఁడు.

అర్జు—తెలుపవలసినదేమి? మీరు వచ్చుటయే తప్పక యన్నగారి ప్రయాణము సూచించుచున్నది. కష్టములు రానీ సుఖములే కలుగనీ పాండవ సోదరులు యుధిష్ఠిరాజ్ఞోల్లంఘనంబు సలుపరు.

ధర్మ—మహాత్మా! నా సోదర చతుష్టయమే నన్ను సార్థకనామునిగా జేయుచున్నది. ఈ వార్త మా పురోహితుండగు ధౌమ్యున కెఱింగించి మీ వెనువెంటవచ్చి తండ్రిగారి యడుగుఁ దమ్ములు సేవింప గలము. భవదుపదేశ నీతిభేషజమే సర్వ విచారామయముల నుండి మమ్ము తొలగించి మనుచుఁగాత. తాము దేవపూజకు దయచేయ వలయును.

విదు—(నిష్క్రమించును.)

ధర్మ—నకుల! జేపకడ తండ్రిగారి దర్శనమునకై పయనమగునటుల సేనలను శుద్ధాంతము నియోగించుము. సభ్యులకు సెలవొసంగుము.

(అందఱు నిష్క్రమింతురు.)

ఇది చతుర్థాంకము.

# ద్రౌపదీవస్త్రాపహరణము

## పంచమాంకము

దుర్యోధనుని సౌధము

(ధృతరాష్ట్రుడు సుయోధనుఁడు, శకుని యుండవలయును)

ధృత—నాయనా! సుయోధనా! అపూర్వసభాభవనము నిర్మింపఁబడినది. దీనం బ్రవేశింప శుభముహూర్తము నిశ్చయింపబఁడినది. మఱియు దీనం బ్రవేశించి యద్భుతంబగు జన్నం బొనరించి పలువురు మన్నిలచే సన్నుతిగాంచుము. రాజులందరునీకు నవారిగా కానుక లర్పింపఁగలరు. యుధిష్ఠిరుండు సహాకారి గాఁగలఁడు. భీష్మ ద్రోణాది మహాయోధ దోర్దండపరిఘా సంరక్షితంబైన మనరాజ్యంబు సకల లోక పూజ్యంబయి ప్రాజ్య రాజ్యసామ్రాజ్య వైభవోపేతంబుగావున భేదబుద్ధి మానియుండుటలగ్గు. మఱియు.

ఉ. ఇమ్మహి నీవు పాండవులు ♦ నెప్పటియట్లు పరస్పరాను రా
గమ్మున నేలుచున్కి- యిది ♦ కార్యము పాండవలక్ష్మి నీ కస
హ్యమ్మననేల వంచనఁ బ ♦ రార్థగ్రహబుద్ధి సేసి పా
పమ్మగు పాపకారులకుఁ ♦ బాయు నవశ్యము నర్థధర్మముల్.

కావున జూదము మాని సుఖం బుండుము, మఱియు ధర్మాధర్మవిదుండయిన విదురునకిది సమ్మతంబుగాదు. ధర్మజు సంపదకంటె నేను మడుంగులు నీకు సంపదగలదు. వా రొనర్చిన జన్నంబుకంటె నెక్కుడుదక్షిణ లిచ్చి నీ కిష్టంబయిన యజ్ఞంబొనర్పుము. దీనిచే నపారంబగు కీర్తి వహించియుండుము.

దుర్యో—తండ్రీ! నీ వమాయకుఁడవు. పుత్త్రప్రేమ పూర్తిగావదిలినవాఁడవు. నీవు వేయిసభలు కట్టింపుము. పదివేల జన్నములు మితిలేని

దక్షిణలతోఁ జేయింపుము. ఆ వైభవములో సహస్రాంశము
దీనికి రాదు. ఆ కీర్తియు దీనికిరాదు. ఇటు వినుము.

ఉ. ఎక్కడిరాజ్యలక్ష్మి మన • కెక్కడి సంపదలయ్య! దవ్వ యిం
కెక్కడిదయ్య తండ్రి నుతి • కెక్కినవారలు పాండవేయు ల
మ్మక్కయనంగ సాటినృప • మండలి గుండెలు తల్లడిల్ల పెం
పెక్కి పరాక్రమార్జితసు • రేశ్వరవైభవు లైరి వింటివే.

వారి యైశ్వర్యమును తేజంబును వర్ణించుట నాకుగాదు కదా సహస్ర
శిరంబులుగల యాదిశేషునకైనఁ దరంబుకాదు. ఒక సార్వభౌ
ముండు శత్రుసౌభాగ్యము సహించి యోర్చి ప్రాణములతో నుండఁ
గలఁడా? వారి యజ్ఞంబునందు జరిగినచిత్రం బొండు చెప్పెద. అట్టి
యోగ్యత నాకీ జన్మకు కలుగునేమో నీ బుద్ధిచే యోచింపుము.
రాజసూయావభృథస్నానానంతరమున నిండు పేరోలగంబున నున్న
తఱి నానాదేశాగత రాజలోకంబునకు ధర్మరాజదర్శనం బొసంగ
కాలంబు నియమించిరి. అప్పుడా శిశుపాలమస్తకచ్ఛేద విరాజిత
శౌర్యాలంకారుం డగు శౌరియు, నసమాననీతి విద్యాపరిశీలన
నిర్మలీకృత శేముషీవిశేషభూషణ భూషితుండగు సహదేవుండును,
గుమ్మముకడ నిలువఁబడి కిరీటమాంధాతలగు రాజాధిరాజుల
మెడఁబట్టి ధర్మజ పాదపంకజంబుల మ్రొక్కించుచు నితఁడు కేరళ
దేశాధీశుఁడు, అతఁడు బర్బరవిషయ భూపాలుఁడు. ఈతఁడింకొకఁడు
అతఁడు మఱియొకఁడని చిల్లర భటాళిజులను నెట్టినట్లు నెట్టిరి.
భీమార్జునులొకవంక మిక్కిడిరాజులను ముందఱికి గుంపులుగాఁ
ద్రోచి, నామగోత్రంబులను దెలుపకయే ఉవ్యక్షేత్రంబుల మహో
త్సవదర్శనాగత దూరదేశీయుల వేత్రహస్తులు నెట్టినట్లు, చర్మ
[illegible]ంబుల గొఱ్ఱెలను దుమ్మించినట్లు, ధర్మరాజు దర్శనము
[illegible]చి త్రోలివేసిరి. ఆ సమయంబున పరస్పర సంఘర్షణ రాజన్య
కిరీట స్థగిత రత్నసముదాయంబులు చూర్ణంబులయి సభాప్రాంగణ
మంతయు రత్నకసితామయమయి కనులు మిరుమిట్లు గొల్పినది.
దమయంతీ స్వయంవరాగత రాజన్యసమూహము రాజమార్గంబులఁ

జనునప్పుడు గానుగసుప్పుగింజవలె నలిగియుండియు భైమీపాణి
గ్రహణ మహోత్సవాసక్త బందీకృత ప్రాణులయినట్లుగా గ్రంథాం
తరవర్ణనల నాలకించి యుపమోత్ప్రేక్షాద్యలంకార నిబిడీకృత
కృత్రిమవాచాళులని కవుల నా మనంబున నాక్షేపించితి. ఇప్పు డా
వర్ణనలను చాలవని మహోదారస్వభావ వర్ణనాసౌశీల్యులగు పండి
తులవాక్కు లనర్ఘంబులని యిప్పుడు తలంపునకు వచ్చినది. అట్టి
వైభవంబు నావంటి యదృష్టహీనునకు దొరకునా? తండ్రీ ! ఇట్లు
నలుగుడువడియు మహారాజు లందఱు.

ఉ. సాగరసారవారిరుహ • శౌక్తిక మౌక్తిక విద్రుమద్రుమై
లాగరుచందనంబులు ప్రి•యంబున నిచ్చిరి తెచ్చి యున్నత
శ్రీగుణయుక్తమై పరగు • సింహళ కేరళ చోళ పాండ్య దే
శాగతరాజపుత్రులు మ•హాగుణశాలి కజాతవైరికిన్.

మఱియు హూణ పారసీక దేశంబులయందలి రాజులు పర్వతనిభంబు
లయిన గజంబులు దివ్యాంబరాభరణ భూషితంబయిన యోషిత్స
హ్రంబును, మరు కుకురు కులూత కేకేయ, కాశ్మీర కాంభోజ
రాజకుమారు ఁవారిగా నొసంగిరి. ఇవి యన్నియుఁ గన్నులారఁ
జూడ నా మనంబయోమయ మయిపోయినది. మహారాజా !

గీ. ఏకచక్రపురంబున • హీనగతిని
బిచ్చమెత్తిరి పాండవుల్ • బిడియపడక
కాలవైఖరి మంచిదై • గాంచె రిప్పుడు
[illegible] యశమును రాజ్యాధి•పత్య మహహ !

బాబాయి! ఈ క్షత్రియుండు దాయఁ సిరిఁ జూచి మాన ప్రాణం
బులతోఁ జీవింపజాలఁడు సుమా.

శకు.—అబ్బాయి! ఇది మీ తండ్రికిఁ దెలియని విషయమా పలు
మారు వచించుటకు? బాబా! పుత్రుఁడు శత్రువిజయ మొనర్చుట
రాజ్యాభివృద్ధి సేయుటకంటె నీకు కావలసిన దేమియున్నది ?

మఱియు వ్యవహారమున, నడుసునఁ బాతిన కంబమువంటిది. ఎటు నైనఁ ద్రిప్పినను దిగఁబడునని, పుత్త్రప్రేమ నిన్ను యుద్ధమున కియ్యకొననియ్యదు. దీనికిఁ జక్కని యుపాయంబు నీకుఁ జెప్పితిని గదా !

చ. సిగపడి పుర్వు వాఁకదు న♦శింపదు సేన యొకింత యేనియున్
తగలదు చేతికిత్తె మొక ♦ దమ్మిడియైనను విక్రమంబు సొం
పుగఁ గసిగందకుండ కను♦మూసిన కాలములోన మాయచే
పగతుర రాచకల్మిల న♦వశ్యము గుంజగవచ్చు మెల్లగాన్.

ఈ యుపాయముచేతనే పాండవలక్ష్మి హరింపవచ్చునుగాని వేఱొక మార్గంబున దేవేంద్రుడయిన పార్థులసంపద నపహరింపఁ జాలఁడు. ఒకడు చావక, రక్తము బొట్టెయినను కనులఁ జూడక, యలయక కుమారుఁడు వైరుల సిరి యపహరింపవలదని నీవేల పుత్రుని జిన్నఁ బుచ్చి యప్రతిష్ఠ పాలుగావలయునో యోచింపుము.

దుర్యో—తండ్రీ! యింకొకమాట, పాండవు లల్పులు, వారల సిరి మనల నేమి సేయునని తలంపకుము.

ఆ. అల్పుఁ డయ్యు మనుజుఁ ♦ డతిపరాక్రమమున
పేర్మి తరతరంబుఁ ♦ బెరుగుచున్న
వాఁడు మ్రాను మొదలి ♦ వల్మీక మా మ్రాని
జెరచునట్లు గడగి. ♦ చెరుచుఁ బరుల.

అహితులను నుపేక్షించిన స్వల్పంబుగా జనించిన వ్యాధి ప్రబలంబై మనుజుని నశింపజేసినట్లు తుద కసాధ్యులై ద్విషన్మండలంబు ఉపేక్షితుని నిర్మూలంబు సేయుఁ గావునఁ బరిపంథు లల్పులని యుపేక్షింపరాదుగదా. కావున వారిని రణవ్యాపారంబున జయించుట కన్న మనమామ యనుగ్రహంబున,

క. పరమ సుఖోపాయంబున
భరసంపద చేకొనంగ ♦ బడునేని నరే

శ్వర యంతకంబె మిక్కిలి
పురుషార్థం బెట్టి దొందు భూనాథులకున్.

కావున నీసభలోపలం బాండవులతో సుహృద్ద్యూతంబున గోడం బడితివేని నాచేత వేయి యజ్ఞములు చేయించినట్లు కనకాభిషేక మొనరించినట్లు, ఇట్టి సభలు పదికోట్లు కట్టించి నాకు నిప్పించిన నావంతసంతసంబుం నా హృదయంబున బుట్టదు. నీవందున కీకొన్న నాకు బలవన్మరణంబును నీకు పుత్రశోకంబును తప్పదు.

ధృ—నాయనా! నేను విదురుని శాసనంబున నడుచువాఁడను. అతం డర్థానర్థవిదుండు. జూదంబున విగ్రహం బగుననియు బలవంతుల తోడి విరోధము క్షేమముకాదనియు, కావున దానిం బరిహరించుట లగ్గగుననియు పలుమారు వచించె. ధర్మోపేతంబయిన నావచ నంబున దూత్యదుర్వ్యవసాయము మాని పాండవులతో వైరంబు వీడి యనుతాపంబు నొందక సుఖంబందుము. అధర్మంబున శత్రు వులం జయించుట యన్యాయంబు.

దుర్యో—తండ్రీ! యీ విషయము నీతో పలుమారు వచించుట పరి హాసాస్పదము. పుత్రప్రేమ సహజముగా కలుగవలయును. కాని బలవంతముగాం బట్టి నెట్టిన కలుగునా? పుత్రుఁడు దాయలకన్న మిన్నగ నుండుట చూచుటకు ప్రాప్తియుండవలదా? కన్నతండ్రి కట్టి ప్రేమనాయం దకారణముగాం గలుగకుండుటయు నా యపూర్వాదృష్టమే. అధర్మమాటివి గావునం నిపుడే యొకమాట చెప్పి, ప్రాణము విడిచెద.

క. నముచి యను దనుజుం డుగ్రత
పము సేయుచున్నవాని • బలమథనుం డధ
ర్మమున వధియించె రిపు ప
క్షము నెమ్మెయినైనం జెరుపం•గా వలయు నిలన్.

వైరుల రూపుమాపుట పౌరుషముగాని, ధర్మాధర్మవిచారణ యావశ్యకముకాదు. రాముఁ డొనాఁడు వాలి నెంత యన్యాయముగాఁ గొట్టినది వాల్మీకి వివరింపలేదా ? తాఁ బట్టిన కుందేటికి మూఁడేకాళు లనునట్లు కొడుకు చచ్చినను సరేయని దృఢచిత్తుఁడవైన నీకు విదురుని యోజగాని, లోకములో నెవ్వరయిన—

క. తనకార్య మొరుమతంబున
నొనరింపఁగ నేరనగునె ♦ యొరునిమతంబు
న్దనమతము నొకడు గానో
పునె చెచ్చెర నిశ్చయింపఁ♦బోలునె చెపుమా.

గీ. విదురమతము పాండ♦వేయ హితార్థంబు
వానిబుద్ధి నెగడ♦వలనదయ్యె
పక్షపాతబుద్ధిఁ ♦ బరగుచుండెడివాని
నాప్తుఁ డనఁగఁ దగునె ♦ యవనినాథ !

నాయనా! నా గ్రహచారము నీ కాబుద్ధి పుట్టనీయదు గాని, గృహచ్ఛిద్రము లొరులకుఁ దెలియనీయఁ దగదని నీకుఁ దెలియదా ? ఎద్దునడిగి గంతగట్టినట్లు నీకుమారుని యభివృద్ధికై శత్రుపక్షము వారి యిష్టానుసారముగ నన్ను నడువవలసినదని నాకు బోధించి పితృవాక్య నిరాకరణ దోషము నాయం దారోపించుటకంటె, బలవంతులును, న్యాయశీలులునునగు పాండవేయుల కీయైశ్వర్యము నర్పించి, వారల కూడిగ మొనరించుచు, నీచసేవకునిగానుండ నియమించిన న్యాయముగా నుండునుగదా. విదురుఁడు సంతసించును. నీకనులు చల్లగా నుండును. ఆహా విధి విధానము !

గీ. దైవమున కేను పగవాఁడ ♦ తండ్రి! నిన్ను
దూరు టెంతయు దోసంబు ♦ దొల్లి నేను
జేసికొనినట్టి కర్మమే ♦ చేసె నిన్ను
దాయగాఁ గను నా వ్రాత ♦ తప్పి చనునె ?

నిక్కముగా జూదంబున కోడంబడెదవా లేదా ? చదువు సంధ్యలు లేనట్టి పరమశుంఠకు బోధించినట్లు నా కుపదేశించుచుంటివి గాని, సుహృద్ద్యూతంబున దేవసామ్రాజ్యంబు వడయుదురని రణరంగమున క్షత్రియుఁడు వైరుల నోడించుటయు, ద్యూతంబున నోడిచి కొనుటయు సమానమనియు, ద్యూతంబున కాహూతుం డయిన భూనేత పరాఙ్ముఖుఁడైన పరాజితుఁ డట్టులనియు, నీతిశాస్త్ర రహస్యజ్ఞులు నుడువుచున్నారు. కావున దీనిం బ్రవర్తింపజేయ శకునికి నుత్తరం బొసంగుము. కా దనకుము.

ప్రాతి—రాజచంద్రమా! పాండవసహితుండయి విదురుండు, భవద్దర్శనము కాంక్షించుచున్నాఁడు !

ధృత—అట్లయిన నిరాటంకముగా సభారంగము ప్రవేశింపఁ జేయుము.

దుర్యో—(మాట్లాడకుండ, తండ్రిపాదములు పట్టుకొని నిష్కర్షముగా జూదమాడించ వలయునని బతిమాలవలయును.)

(అందఱు నిష్క్రమింతురు.)



# ద్రౌపదీవస్త్రాపహరణము

## షష్ఠాంకము

(ధృతరాష్ట్రుఁడు గాంధారి, భీష్ముఁడు, ద్రోణుడు, కర్ణుడు, వికర్ణుడు, దుర్యోధనుఁడు, దుశ్శాసనుఁడు, శకుని యుండవలయు, విదురుఁడు, ప్రాతిగామి, పాండవులు ముందుగా, వెనుకనుంచి ద్రౌపది గాంధారి వైపుగాఁ బ్రవేశింపవలయు)

విదు—రాజసార్వభౌమా! ధర్మజుండు సానుజుండై తండ్రిగారికి నమస్కరించుచున్నాఁడు. నీ యాదరంబున కెంతో సంతసించుచు, నీపద సందర్శనమున కెదురుచూచుచున్నాఁడు.

ధృత—ఏడి, మాపెద్దబ్బి? వచ్చినాడా? (అని చెయ్యిచాచి కౌఁగిలించు కొనవలయు.)

ధర్మ—తండ్రీ—భవత్ప్రియపుత్రుండు పాండవాగ్రజుండు సహోదరుండయి నమస్కరించుచున్నాఁడు. (అని ధృతరాష్ట్రునకు గాంధారికి నమస్కరించవలయును తమ్ములుకూడ నమస్కరించవలయును.)

ధృత—చిరంజీవివై రాజశ్రేష్ఠుండ వగుము.

గాంధా—సుఖముగా వర్ధిల్లుము, నాయనా! కోడలు ద్రుపదాత్మజ యెక్కడ?

ద్రౌప—ఇదిగో పాదాభివందన మాచరింపుచున్నది.

గాంధా—అమ్మాయి! వచ్చినావా? నీయమ్మకడుపు చల్లగా. రా, భానుమతి నీకొఱకై వేచియున్నది. అమ్మాయి! అత్రికా! కృష్ణను భానుమతీమందిరము చేర్చుము.

పాండవులు—(భీష్మునకు నమస్కరించవలయును.)

భీష్మ—ధర్మాభివృద్ధి యగుఁగాత. ధర్మనందనా! పండితు లనపరేంగితాభిప్రాయము కలవారు, పరేంగిత జ్ఞానము లేనివారు పామరు లనంబడుదురు. మఱియు నాయతులు కాగోరువారు దాయల చిత్త వృత్తులు చార నేత్రంబునను, జ్ఞానలోచనంబునను జక్కఁగాఁ బరికించి మెలకువతో మెలఁగవలయు. మాయావిదులగు వారును, పరమ లుబ్ధులును, పరశ్రీయోసహానులగు దురాత్ముల దురాలోచనా జాలంబులఁ జిక్కక మేధావి ప్రజ్ఞావిశేషంబున సంచరించవలయును.

ధర్మ—(ద్రోణునకు నమస్కరించవలయును)

ద్రోణు—చిరకాలంబు వర్ధిల్లుము. విజయంబు గాంచుము.

ధర్మ—(దుర్యోధనుని కౌఁగిలించుకొని) సోదరా! శత్రుభయంబు లేకుండ రాజ్యం బనామయంబు గదా?

దుర్యో—ఆ భయంబులే మమ్ముల బాధించుచున్నవి. సవిస్తరముగా వచియించెద నాపీఠ మలంకరింపుడు.

ధర్మ—(కూర్చుండవలయును.) అంగరాజా! క్షేమమా?

కర్ణుఁడు—నామిత్రుని క్షేమమే నాక్షేమము. శత్రువులు పూర్తిగ నశించుదనుక క్షేమ మెక్కడిది?

శకుని—పాండునందనా! అపూర్వసభాప్రవేశ సమయంబున, సభావైభవ సందర్శనార్థమై తండ్రిచే రావింపఁబడితివి. నిండు పేరోలగంబున నీసోదరపంచకమును జూచు వైభవము మాకు సంప్రాప్తమయినది.

ధృత—పాండవాగ్రజా! దుర్యోధనుని గలిసి పరిషత్పరీక్షణ మాచరించి మయసభకును దీనికినిగల తారతమ్యము నీ సో[illegible]రులతోఁ గలసి నాకు వివరింపుము.

దుర్యో—సోదరా! తండ్రిగారు వేవురు శిల్పాచార్యుల రావించి, వారిచే నపూర్వమణి సభాభవనంబు నిర్మింపఁజేసిరి! అందలి శిల్పంబులు పరిశీలింపఁదగు,

భీము—ఇది మా జాగిలంబుల విహారశాలవలెఁ గనుపట్టుచున్నది.

దుర్యో—(గుమ్మరిమి చూచుచు) మఱియు నీ నూతనసభారంగంబున నీతోడసుహృద్ద్యూతం బాడవలయునని చిరకాలమునుండి నాకుఁ గోరిక కలదు. ఇప్పుడు సంభ్రమంబునఁ జేయఁదగిన పను లెవ్వియు లేనందున—ప్రొద్దుబోవకయున్నది. ద్యూత్యక్రీడయం దీ వసమానుండ వని పలువురు చెప్ప మాటుల నేక సభాస్థలంబులయందుఁ గొనియాడు చుండ వినియుంటినిఁగాని, తగినయదను దొరకకపోవుటచేతనా మనోరథము నెఱవేఱకపోయినది. దైవయోగంబునఁ జేసి వృద్ధానుమతంబున సభావలోకనార్థ మనుదెంచితివి. ఇంచుక సేపు పాచికలు చేతఁబట్టుము ఒకటిరెండాట లాడిచాలింతము కాదనక నాకోరిక నెఱవేర్చుము.

ధర్మ—సోదరా! దుర్యోధనా! నీకోరిక యొకటియు నాకోరిక యొకటియునా? కాని యీ వ్యవసాయ మేమియు బాగుగానున్నదికాదు. నీతిబాహ్యములగు కార్యంబు లుత్తమక్షత్రియు లాచరింపఁగూడదు. దానం దప్పక ముప్పుగప్పును. నిత్యధర్మపరులగు రాజులు, ద్యూత్యంబును నిర్కృతియు పూర్తిగా విడువఁ దగినవి. మఱియు నీరెంటి యందును బాపావహమయినది ద్యూత్యంబు. కుటిలమార్గప్రవర్తకులును, కుచ్ఛితులును, పరశ్రేయోసహనులును నగు కితవులతో నాడఁగూడదు. మోహంబుచే నట్టి కార్యంబున బ్రవేశించినవార లఖిలధర్మ విసర్జితులై దుష్టకార్యప్రవర్తకు లగుదురు దానిచేఁ బ్రజలకును జెండ్లకును బరస్పరము స్పర్థ లేర్పడి వైషమ్యంబు ప్రబలి తుదకు దేశమున కరాజకస్థితి ప్రాప్తించును. మాయాద్యూత్యంబునఁ బరిపంధుల జయించుట మహాపాతకమనియు, ధర్మయుద్ధంబునను ధర్మద్యూత్యమునను వైరుల సిరుల నోడిచికొనుట పుణ్యంబనియుఁ దొల్లి యనితుండైన దేవగురుండు వాక్రుచ్చె. ఇంతియగాక పరులక్షేమంబు చూచి యోర్వలేక తాను సుఖపడు శక్తిలేక యొరుల మోసగించి వారిసిరుల నపహరింప నెంచువాఁడు తుద కనర్థంబుల పాలగును. అట్టివాఁ డెన్నఁడు విఖ్యాతి గాంచఁడు

వారితోడి పొత్తు ఉత్తమ క్షత్రియుల కర్హంబు గాదు. అట్టి యుద్య
మంబు మానుట యుక్తము. దుర్వ్యవసాయంబులు హృదయంబున
నిల్వఁగూడదు. భీష్మాదుల ధర్మోపన్యాసములనో కుమారుల
శస్త్రాస్త్రప్రయోగ వైచిత్ర్యములనో కాలయాపన మొనరింతము.

శకుని—సుయోధనుఁడు రాజనీతి శాస్త్రంబులు మూలమట్టముగాఁ
జదివినవాఁడే ఈ యుపన్యాసమునందలి తాత్పర్య మీ దుర్యో
ధనుఁడు గ్రహింపనేరఁడని నీ వనుకొనకుము. అటు తలఁచుట
వెఱ్ఱితనము. నీతిజ్ఞుఁడును, లోకవృత్తము బాగుగా నెఱిఁగినవాఁడును,
బుద్ధిమంతుఁడును, విద్యావిదుండును జూదము నిందించునా? బల
హీనులయినవారు బలవంతుల జయించవలసిన ననేక మాయోపా
యములు పన్నెదరు. అదికాదనుటకు రాజర్హుఁడా? అదిమర్త్యులకు
జయము కాదందురా? ధర్మనందనా? జూదమాడుటకు నీ హృద
యము జంకుచున్న నోడితిననుమాట పైని వేయుము. అంతకంటె
నుత్తమము చేతకాదనుట అంతియెకాని యధర్మమని, పాపమని,
యనర్థంబని యసందర్భము లేల పలుకవలయును?

ధర్మ—ఓయి సౌబలేయ! బంధుధర్మం బవలంబించి యింతదనుక
నుడివితిని. కాని కేవల క్షాత్రము ననుసరించి కాదు. ఇంతమాత్రము
నకే చేతగాదనవలయునా? జయాపజయంబులు దైవాధీనంబులు.
దైవమా ధర్మాధీనంబు. మనుజుం డెప్పుడు సుఖమునే చెందునని
గాని సదాదుఃఖాభిభూతుం డగునని కాని యెవరు వచింపఁగలరు?
దైవోపహతులగువారు పరులు చెప్పినను ప్రత్యక్షముగా ననుభ
వించుచున్నను తమపట్టును విడువరు. ద్వేషలతాలవాలమగు
ద్యూతము కుటుంబ కలహాంకురమై, భరతవంశ మర్యాదలకు
హానికరమగుననియు, వంశభేదముల కిరవగుననియు పరిత్యజించుట
ధర్మము! నిగాని బలవంతముగాఁ బిలువఁబడి మఱలుటలు ఆయో
ధనంబునఁ బరాజితుండట్లు దూరగుం డగునని తెలియని విషయ
ము కాదు. పెద్దలచేఁ బరివేష్టింపఁబడిన పరిషన్మధ్యంబున సుహృ

ద్యూతంబని పిలువబడుచు మాయోపాయంబున శత్రువుల జయించుట యన్యాయం బనుచు నుపన్యాసంబు గావించుట నామనంబునకు వ్యత్యస్తంబుగా గనుపట్టుచున్నది. కాఁబట్టి బంధుధర్మము పరిత్యజించి కేవల క్షాత్ర మనుసరించెదమన్న ఫలాఫలంబులు దైవాధీనంబులుగాఁ దలంచి మీ కోర్కెఁ దీర్చెద. సౌబలియు, వివింశతి, వికర్ణుఁడు, చిత్రసేనాదు లందఱు పాచిక లలకరించుకొని యున్నారలు, వీరిలో నాడఁ బన్నిదము జరచి జూదమాడు బలశాలి యెవండు ?

దుర్యో—ధర్మనందనా! నీవు నిశ్చయముగ న్యాయవాదివి, బంధురథపరిపూర్ణ కుతూహల మానసుండవు. కద్యూతాగము చర్చితంబులయి యర్చితంబులగు పాచికలు చేతఁ బట్టుటకై చిరకాలమునుండి నామనంబునఁ జెనఁగు నాశాలత లాశాసముదాయంబుల వ్యాపింపఁ గొనసాగింప జేయుటయే. అక్షక్రీడాభిజ్ఞుండవగు నీతో సమానముగాఁ బాచి కాడ మా మామయగు శకుని సమర్థుండు అతం డొడ్డిన యొట్టి పణంబయినను నే నంగీకరించెద. నా మామగు నీతో నాడం గల జెట్టి యీతఁడే కాని వేరొండ్లు లేరు. కాల మతిక్రమించకుండ నాట ప్రారంభించుము.

ధర్మ—అదియు గూడనిదియే. ఒకనికై యొకఁడు పాచిక లాడుట ధర్మవిరుద్ధము కాదా! ఆటయందు ప్రవేశించినవాని మనంబు చంద్రోదయంబున సముద్రవలెనుప్పొంగి మిన్ను ముట్టుచుండును మఱియు గెల్పుటయందుఁ గల్గిన సంతోషములకంటె నోటున హృదయంబునం గలుగు చలంబు మిక్కుటము. అట్టి సమయంబునఁ శరీరంబయిన బణం బిడవలసివచ్చును. అతఱి నొకని యాటకింద నొకండు పణం బిడుట కస్వతంత్రము, అశాస్త్రీయము, నసంబద్ధము. విత్తస్వామి యాడవలయును. స్వసాహసము ననుసరించి పణం బిడవలయు.

గీ. తాను సాహస మూని యుద్ధంబు సలుప
పరుల సాహాయ్యమును బూనవలయుఁగాని

తాను రణమున దిగనాడి ♦ తనకుగాను
సకల ప్రాణంబు దీయుట ♦ భావ్య మయ్య?

రణంబునను సకల శస్త్రాస్త్రంబుల ధరించి యొరుల రథంబధిష్ఠించి
కైకొన్న జయంబు సందిగ్ధం బగుడు. స్వయముగాఁ బాచికల జేతఁ
బట్టుము.

శకుని — ధర్మరాజా! నీ విట్లు పలుకుటఁ జూడ నెద్దియో సాకుపెట్టి యీ
యక్షక్రీడ నెడగొట్టఁ దలఁచితివని సభ్యులు గ్రహింపలేరా? అవి
నాభావ సంబంధము గల మా యిరువురకును భేదము నీవు కల్పింపఁ
బూనితివి. అత్యంతతాదాత్మ్యము లయిన మా మనంబులు భిన్నాభి
ప్రాయంబుల నొందవు. శరీరములు రెండయినను మామనంబుల
నొక్కటిగాఁ దలంచుము. కాలయాపన మొనరించి రారాజుమనంబు
విఫలమనోరథముగా జేయకుము.

దుర్యో— గీ. అనఘ! మా మామ శకుని నా♦కయి కడంగి
జూద మాడెడి నీతోడ ♦ కాద నాక
యీతఁ డోడ్డిన ధనరాసు ♦ లెవ్వియైన
దప్ప కిత్తును గైకొను ♦ ధర్మరాజ!

రాజ్యసర్వస్వమోడినను తప్పక యప్పుడే యొప్పించెదను! మీయిరు
వురియాటఁ జూడ వలయుననియే నా కోరిక.

ధర్మ—అట్లయిన సాగరావర్తసంభవంబు లైన పరార్ఘ్యమణిహారం
బులు పణంబుగా నిడుచున్నాఁడ. (అని పాచికలు వైచును.)

శకుని—గెలుపు నీయది. ఇదిగో, సువర్ణముద్రికా సంభరితభాండా
గారంబులు మా పందియము.

ధర్మ—నిష్కసహస్రభరితానేకాయుతకుండ మండితంబు లయిన
సువర్ణ భాండాగారములు, మాపణంబుగ నుంచుచున్నాము.

శకుని—(పాచికలు వైచి) ధర్మరాజా! గెలుపు మాకు కలిగినది. పై పందెమేద్ది? (భీమార్జునులు విచారముతో శకునిం జూడవలయు)

ధర్మ—వజ్ర వైడూర్య మరకత మౌక్తిక నీలప్రవాళాది విపుల విశుద్ధ రత్న పరిపూర్ణంబులయిన రత్నభాండాగారములు. ప్రత్యేకంబ పంచ ద్రోణకాంచన సంచితంబులయిన చతుశ్శత నిధులును పణంబుగా గ్రహించవలయును.

శకుని—(పందెము వైచును.)

దుశ్శాసనుఁడు—(పందెము పరిశీలనముగాఁ జూచి, సంతోషముతోఁ దలనూపవలయును.)

శకుని—గెలుపు మనకే.

ధర్మరాజు—మణికింకిణి జాలాలంకృతంబు లయిన యసంఖ్యాతజాతి జాత రూప వరూధయూథంబు లయి కనక కక్ష్యా కుథసనాథంబులయిన మదాంధగంధసింధుర సందోహంబులు సవ్యసాచికి చిత్రరథుం డొసంగిన పదునాల్గువేల గంధర్వహయంబులును పణం బిడుచుంటిని పందెము వేయుము.

శకుని—పందెము నీవే వేయవలయు.

ధర్మ—(పందెము వైచి చూచి విచారముగా నుండవలయు.)

శకుని—దుర్యోధనసార్వభౌమా! నీదియే గెలుపు. ధర్మజా! మఱియు నేమి యొడ్డెదవు? నీవు పందెము గెలుచుదనుక, మా సువర్ణభాండాగారములే పణంబులు, ఏము పలుమరు వచింపనక్కఱలేదు.

భీము—(రహస్యముగా నర్జునునితో) మాయచేయుచున్నాఁడు.

అర్జు—అన్నగారు భ్రమపడుచున్నారు. మనము మాట్లాడఁగూడదు.

ధర్మ—పరార్ధ్య రత్నభూషితంబు లయిన యోషిత్సహస్రంబులును, అనుదినాతిథి భోజనపాత్రహస్తులయిన శతసహస్ర పరిచారకులును,

దుగ్ధపాన శాలితండుల ఖాదనంబునం బెరుఁగుచున్న సజాత్యశ్వానేకాయుతంబులును, అజావి, గోమహిష, ఖర, రాసభ నివహంబులును, క్రమంబుగాఁ బందెంబుగా గొనుము.

శకుని—(పందెము వైచి) యోషిత్సహస్రంబుల నోడిచికొంటిని. ఈ పందెము, నీవే వేయుము.

ధర్మ—(పందెము వైచును. విచారముగా నుండవలయును.)

శకుని—కురుకుల సార్వభౌమ ! శతసహస్ర పరిచారకులు నీ యధీనమయిరి పాండవాగ్రజా! యీ పందెము నేను వేయవలెను. (అని పందెమువైచి) కురుకుల కమలినీరమణ సజాత్యశ్వానేకాయుతంబులును, గోమహిషఖర రాసభాది పశుగణంబు లెల్ల నీ యధీనంబులయినవి. యుధిష్ఠిరా ! యింకఁ బై పందెము స్పష్టముగాఁ జెప్పుము.

భీము—(శకునిని తీవ్రముగాఁ జూచును, అర్జునునితో "మితిమీరి పోవుచున్నది." అనవలయును!)

ధర్మ—ఖాండవదహన వేళాసంరక్షణ సంతోషితస్వాంత మయదత్తంబయి, సకలదిక్పాల సభాతిరస్కారానల్ప, శిల్ప, కల్పనాకల్పితంబయి, విరోధి భూరమణ మనోనయనాగ్ని దాహకామూల్యరత్నచిత్రభానుప్రభా సహస్రమండితంబయి, మధ్యమలోక నవీనాలంకారమగు మయసభాభవనంబును పణంబుగా నంగీకరించుచున్నాఁడ.

దుర్యో—మామా ! యీ పందెము నీవే వేయవలయును.

శకుని—రాజరాజ! పరాక్రమార్జిత శత్రువిజయాలంకార ! ధీనైపుణ్యాదిస్సపత్నీకృతరాజన్య చూడామణీ ! పాండవాగ్రజుఁడు న్యాయవాది. అన్యథా తలంపకుము. కౌంతేయాగ్రజా ! వంతు నీయది. జయాపజయంబులు దైవాధీనంబులని ప్రథమంబున నుడివిన నుడువులు మనంబున నిడుకొని సత్యప్రతిజ్ఞకు భంగము తెచ్చుకొనక యింతకు మున్నోడిన పందెముల జ్ఞప్తినుంచుకొనక పందెము వేయుము. సభాప్రభావమున నీవే గెలిచెదవేమో ?

ధర్మ—మామా! మాయావుల కుహనా వాఙ్నైపుణ్యము శిథిలీకృత సకల సన్మార్గ ప్రచారమని యెఱుంగుము. పరాత్పరుండగు పరమేశ్వరుండు సత్యసంవర్ధనుఁడు కాకమానఁడు. అన్యాయాగత ద్రవ్యము సమూల నాశకం బను భయంబు పూర్తిగా విడచినవాఁడను కాను. వ్యర్థముగా వాగాడంబర ప్రదర్శన మేల? ఇదిగో పందెము వేయుచున్నాను. (అని పందెము వేయవలయును.)

శకుని—ధార్తరాష్ట్రాగ్రజా! పందెము మనదే. మయసభాభవనము భవత్కరగతం బయినది. (కౌరవు లందఱు కేకలువేయుదురు.)

విదు—కురువంశజలధిచంద్రమా! యాంబికేయా! నీ కుమారు లన్యాయాగతధనమదంబు పెంపున నైమఱచి చేయు దుష్కార్యములు, నీమనో నేత్రంబునఁ జూడవలయు. మహాభిష, భీమసేన శంతనుల నాఁటి నుండియు, నెన్నఁడును పాపంబు పొరయని కౌరవవంశము నేఁ డీ దుర్యోధనుని కారణంబునఁ బాపభూయిష్ఠం బగుచుండ నీవు చూచి చూడనియట్లుపేక్షించుట న్యాయంబు కాదు. ఒక్కని కారణంబున గులంబున కెగ్గగునేని వానిని దూషించి కులంబు రక్షించుకొనుట ధర్మంబనితొల్లి శుక్రుఁడు సెప్పె. మొన్నమొన్న యాదవ వృష్ణి వీరులు వంశరక్షణంబు గావించుకొనుటకు జగన్నాటక సూత్రధారియగు శ్రీ నారాయణావతారంబగు కృష్ణుని నియోగించి, కులదూషణుండయిన కంసుని వధించుట వినలేదా? మఱియు నసూయా మదగ్రస్తుండగు సుయోధనుండీ యిలాతలంబున జన్మించినతోడనే పతాకంబుల గ్రద్దలు వ్రాలి రెట్టలు వైచె; పిడుగులుపడియె నక్కలు చెలరేగి కూయఁజొచ్చె. హోమకుండంబులు చల్లారె, సూర్యమండలంబున బరివేషగతుండయ్యె. ఉత్తమాశ్వంబులు కనుల నీరు గార్చె; ప్రజల మనంబులు భీతిల్లెఁ. గావున వీనిం బరిహరించుట కర్తవ్యము. దీన నీకుఁ బాపము రాదు. శ్లో॥ త్యజేత్కులార్థే పురుషం! గ్రామస్యార్థే కులం త్యజేత్ । గ్రామం జనపదస్యార్థే హ్యాత్మార్థే పృథివీం త్యజేత్॥ అనఁగ నొక్క కులంబు రక్షించుకొనుట కొక్క పురుషుని నొక్కగ్రామమును గాపాడుకొనుటకు

నొక్కకులంబు నొక్కదేశంబు కాపాడుకొనుట కొక్కగ్రామంబును తనయాత్మను సంతసించుట కొక్కదేశమేకాక సమస్తభూతలంబు విడువవచ్చునని పెద్దలు నుడువుచుందురు. కావున నీకురుకులాపశదుని, ఈగుణహీనుని, ఈపరమలుబ్ధుని ఈనీచుని బహిష్కృతునిఁ జేసి ధర్మమార్గమున గౌరవాన్వయముఁ గాపాడఁదలఁచితివేని, శౌర్యశాలియు, మహాబలశాలియు, ధర్మమార్గవిదురుడయిన పార్థునకో భీమునకో మొదల నొసంగిన, నీశాసనంబున విచారవిదూరులయి సుయోధనునిం గడచేర్పఁగలరు. దాన నోభూరమణా! నీవును, నీప్రజయు, నీకోశంబును, నీభూమియు నిస్త్రాసంబున నుండఁగలరు. ప్రజ్ఞాచక్షూ!

ఉ. పిల్లలఁ దెచ్చి పెంచి తగు ♦ విద్యయు బుద్ధియుఁ జెప్పి వారు సం
ఫుల్లయశోవిశాలులయి ♦ మోదము నొందెడునట్టివేళ నీ
కల్లరిగానిమాటలకు ♦ గా నిటు మోసముఁ జేసి వారి సం
పల్లయ మాచరింపఁ దగు ♦ మార్గమ కీర్తియు? నీతియా గవన్,

కావునఁ ద్రిలోకవిజయ జేగీయమాన పరాక్రమోపేతులయి, ధర్మగోప్తృ శరీర రక్షకులయి, అరిజనహృదయశూలాయమాన గురుజన శిక్షితాస్త్ర శస్త్రధారులయి, ధర్మదేవత లనందగు పాండవులతో దురాచారపరాయణుండును, దుర్వ్యసనాసక్తుండును, దురభిమానియు, దుష్టోపాయలంపటుండగు దుర్యోధనుని యభివృద్ధికై, విరోధంబు మాని, కౌరవాన్వయ గౌరవము కాపాడఁదలఁచితివేని, దుర్యోధనఫేరవం బొసంగి పాండవ సింహంబులఁ జేరఁదీయుము. దుఃఖఫలభాజనం బగు దుర్యోధన బలిభుక్కునొసంగి పాండవ హంసంబులఁ బిలుచుకొమ్ము. దురభిమాన కళంకంబును, పరమలుబ్ధగుణకంటకితంబు నగు సుయోధన శర్కరిలంబు పారవైచి, సౌజన్యవిత్తంబునఁ బాండవ పంచరత్నంబులఁ గైకొనుము. అయ్యా, అంబికేయా! కడుప్రయాసంబున గన్న బిడ్డలకన్న మిన్నగాఁ బోషించిన వృక్షంబులు పూచి, కాచి, ఫలించుటకు సిద్ధమై యున్నతఱి నావృక్షంబుల బొగ్గులకై గొడ్డంట నరుక నెంచు దయా

శూన్యుండవు నంగారకాసుంబోలి యో మహాప్రభూ! తండ్రి లేని
పిన్నవుల నిట్లిడుములం బడఁజేయుట కడుంగడు శోచనీయము; హాని
కరము సుమా. ఓ దుర్యోధనసార్వభౌమా! పరాకు మాని, నా
పలుకుల కించుక చెవి యొగ్గుము. న్యాయమార్గంబు పరిత్యజించి,
సౌబలుని మాయాద్యూత కుహనోపాయంబునఁ బాపమతివై,
భరతాన్వయులలామంబగు పాండవులతో విరోధంబుఁ బెంచు
కొని వారిసిరు లొడిచికొనిన, పలువురకు నిందాస్పదుఁడ వయ్యె
దవు సుమా! పాండవులు ధృతిమంతులు, మతిమంతులు, శీలవం
తులు, పరాక్రమవంతులు, న్యాయవంతులు, పరాక్రమోపార్జిత
తేజోవంతులు, మహాశాంతులు, వారి నేల కోపవంతులఁ జేసెదవు?
వారల కపకృతి నొనర్చుట నీకు లగ్గు కాదు సుమా! అన్యాయో
గతద్రవ్యంబు సమూలవినాశనం బొనరించునని తలఁపవలయు కావున
నా మాట నాలించి, పాండవేయులతోడ విగ్రహంబు వద్దుము.
నీకు గల మహైశ్వర్యముకన్నఁ బాండవుల సిరి యెక్కువయా?
మహారాజా! చిరకాల సముపార్జిత కురుకుల కీర్తిలతల కేల వినా
శముఁ గల్పించెదవు? ఈ దుర్వ్యవసాయము మాని సుఖంబున
నుండుము.

దుర్యో—ఓయి క్షత్త! నీ వేల నిరంకుశంబుగ, నిర్భీతిగ, రాజలక్ష్యంబు
వీడి ప్రసంగించెదవు? నీకీ ధర్మోపన్యాసము లొసంగుమని యెవ్వ
రాజ్ఞ నొసంగిరి? నీ వింతప్పటినుండియు పరుల గుణంబులు గోరం
తలు కొండంతలుగా వర్ణించుచు, వారి యవగుణంబులనైన సద్గు
ణంబులుగా గణించుచు, లోకంబులకెల్ల — వారలే ధర్మవేత్త
లనియుఁ బాండవులే సుగుణవంతు లనియుఁ, గౌంతేయులే వీరు
లనియు, యుధిష్ఠిరాదులే న్యాయవేత్త లనియు, భగవన్నామము
స్మరించునటుల రేయింబవళ్ళనుక్షణంబు వారినే తలంచుచు, వారినే
పొగడినఁ బొగడు కొమ్ము. మ మ్మేల దూషించెదవు? మా శత్రు
వుల విజయంబుఁ గోరుచున్న నిన్ను మాయింట నునిచికొనుట
పాముపిల్లను ఒడిలో నుంచుకొనుట కాదా?

గీ. పిల్లిఁ బెంచిన యజమాని ♦ పిండములకు
గోరినట్టుల మాయింటఁ ♦ గుడిచి నీవు
శత్రువిజయంబు, మాకు న ♦ సౌఖ్యమెపుడు
గోరుచుందువు దుర్మతీ ! ♦ కుటిలమతిని.

శత్రుసంపద సుఖోత్సాహంబుల నోడిచికొనుట యన్యాయమని నీతి వేత్తవుగదా యేమెఱుగమి పెట్టుకొని చెప్పవచ్చితివి? మా క్షేమమును గోరక పరశ్రేయోభిలాషివగు నిన్ను మాయింట నుంచఁ దగదు. వృద్ధరాజున కూడిగంబు సల్పుచుందువను ప్రేమచేఁ జూచి చూడనియట్లుపేక్షించినకొలది మా హితమును గోరువాని వలె నటించుచు సమయము వచ్చినప్పుడు మా పై కొండెము లా వృద్ధరాజుతో జెప్పుచు మమ్ము దూఱుట న్యాయంబు కాదు. ఇఁక నీ వెంగుసుడువులు కట్టిపెట్టి వృద్ధరాజు పాదము లొత్తుచు వారొసఁగిన యొకమూల పడియుండుము.

విదు—ఓయి దుర్యోధనా! యుక్తాయుక్త విచారణ మెఱయక నీ వంటి వానికి బుద్ధిచెప్పవచ్చిన నా యవివేకంబులకుఁ దగిన బుద్ధి చెప్పితివి. పైత్యరోగముగలవాని నోటికిఁ బంచదార చేదయినటుల, రోగార్తునకు భిషగ్వరుండు నుడివిన పథ్యంబు చీకాకొనరించినటుల, దురోదర మధు మత్తుఁ గొనిన నీకు నాపలుకు లసహ్యంబయి తోఁచుట యరిది కాదు. కాని ప్రప్రథమంబున కఠినమ్మై తోఁచినను పిదప మేలుచేయు వాక్యంబులు బలుకు హితుండు దొరకుట కష్టము సుమా! నీ యుచ్ఛిష్టములను దిని నీ వలన జీవించు మాకు నీకు హితోపదేశంబు సేయుటకంటె నొండు పరమార్థముకలదా? ఇచ్చకంబునకై మెఱమెచ్చుతచ్చన లుచ్చరించు తచ్చనగాండ్రు ప్రభువుల మెప్పువడయుటకై పిదప ననర్థదాయకములైనను నప్పటికిమాత్రము రుచించు పలుకులు పలుకువారు పెక్కు–లుందురు. వినుటకుఁ గష్టంబుగ నున్నను ఱేనికడ మోమోడక హితోపదేశము సేయుట పరమ ధర్మము. అట్టి వాక్యంబుల నాదరించని ఱేఁడు కుచ్ఛితుం డనంబరఁగు.

ఉ. కుంతికి ముద్దులాఁడు నయ ♦ కోవిదుఁ డార్యపథానుయాయి య
త్యంతమనోహరాంగుఁడు జ♦యాస్పదుఁ డాహవవోఁహాలుంఁడు సా
మంతుఁడు జ్ఞాత పూర్వబుధ ♦ మండలలక్షణలక్షితుండు ధీ
మంతుని నే పణం బిడెద ♦ మాన్యుని నా సహదేవుతమ్మునిన్
మదాజ్ఞావర్తియగు నాకొండిక సోదరుండు పణం బగుఁగాత.

శకు—(పందెము వైచుచు) పందెము మాది. మాదే.

భీము—(స్వగతము) దైవమా! గ్రహచారము.

ధర్మ—

ఉ. చక్కనిమేనివాఁడు గుణ ♦ సంపద నిమ్మహిఁ బోలినాఁడు పెం
పెక్కుఁడు ధీవిశారదుఁ డ♦హీనమహీధర ధైర్యశాలి యా
జక్కులజేనిమిత్రునను ♦ సాటి యనందగు శౌర్యశాలి నా
మక్కువసోదరు న్నకులు ♦ మానధనాఢ్యుని పందెమొడ్డెదన్.

వైరివీరగర్వాంధకార తమోభాస్కరుండును, మాద్రేయాగ్రజుండును, విశేషించి నాకు భక్తుండును నగు నకులుని పణంబుగా నిచ్చు చున్నాను.

శకు—అల్లుడా! పాచికలను నీవే సారెలోనుండి త్రిప్పివేయుము.

ధర్మ—(పందెము వైచి విసుగుతోఁ బారవేయును.)

శకు—ఈ పందెము కురుకులసార్వభౌమునిదే. ధర్మరాజా! పై పందెము చూపుము. ఆలసించిన రక్తి చెడిపోవును.

ధర్మ—నీలములై, యరాళములైన ముంగురుల యొప్పిదముగల్గి, ఆయతములై, సోగలై, లక్ష్మీనివాసములైన నేత్రముల సిరులు వెదఁజిమ్ము మోమును, ఆజానులంబులై, విజయరేఖాంకితములై ధనుర్గుణసంఘర్షణ పరిత్రుట్యమాన వ్రణకిణాంకితములైన బాహువులు గలిగి నీలమేఘచ్ఛాయ గేరు శరీరంబుతోడ భాసిల్లుచు త్రయస్త్రింశత్కోటి దేవతాపరివృతుండయిన బిడౌజుని భండనంబున నిలువరించిన జయశాలిని, సవ్యసాచిని, పాండవమధ్యముని, మఱియు,

సీ. అంగారపర్ణుతో ♦ నాహవం బొనరించి;
జయమును గైకొన్న ♦ శౌర్యశాలి
ఖాండవం బగ్గిచేఁ ♦ గాల్పఁజేయుచు దేవ
రాజుతోఁ బోరు న♦రాక్రమించు
రాజకుమారుల నెల్ల ♦ రణరంగమున గెల్చి
ద్రౌపదిఁ గైకొన్న ♦ ధైర్యశాలి
పౌత్తరాహులతోడ ♦ నాయోధనము సల్పి
జన్నంపు కప్పము ♦ గొన్నవాఁడు
పరమ కోదండ పాండిత్య ♦ పాటవుండు
ద్రోణశిష్యాగ్రయాయియై ♦ తోఁచువాఁడు
నందనందను బావమ♦ఱంది యిప్పుడు
పందెమాగాత మధ్యమ ♦ పాండవుండు.

శకు—రాజా! పొఱపాటున నంటిని. అట్లు పిలిచెడు యోగము పోయినది గదా! ధర్మాత్మజా! తొందర నొందక, ధైర్య మవలంబించి పాచికల సవరించుకొని యీ పందెము నీవే వేయుము.

ధర్మ—(పందెము వేసి పలక పార వేయును).

భీము—(నుదిటిపై కొట్టుకొనుచున్నాఁడు)

శకు—స్వాధీనకృత వైరిలక్ష్మీవిలాస! కురుకులసార్వభౌమా! మధ్యమపాండవుం డోడుచుకొనఁబడియె. పాండవాగ్రజా: ఆట చాలించెదవా! పాపము ద్రవ్యము కోలుపోయితివి. మూవురు సోదరులు మా స్వాధీనమయిరి. ఒక యుపాయము చెప్పెద. అట్లు చేసిన నీవు గెలిచెదవేమొ? పాప మీదినమున నీచేత నాటపడ లేదు. నీ వోడిన మూవురు సోదరులును, వాయునందనుఁ డొక యుద్ది. నీవు గెలిచిన సోదరత్రితయము బంధనిర్ముక్తులు గాఁగలరు. ఒకటి రెండు పందెములతో నాట పూర్తి కాఁగలదు. సంకోచింపకుము.

ధర్మ—పలుమారు నీ క్లేశ మెందుకు?

శకు___అల్లుఁడా! కోపపడకు, సమయ మిది. సమాధానములకేమి లే. పందెము సంగతి ముందు చెప్పుము.

భీము___(గదతో శకుని నెత్తిమీఁద కొట్టబోవుచున్నాఁడు)

అర్జు___(రహస్యముగా బట్టి యాపుచున్నాఁడు.)

ధర్మ___బకకిమ్మీరహిడింబవిఘాదనుండును, మాగధగర్వపర్వత వజ్రాయుధుండును, శతభారీపరిమితాయసగదాదండమండిత బాహుదండుండును, మరియు తీవ్రకోపియు,

చ. పసితనమాది మీ రెవని ♦ బాహుబలంబున కోడి యార్త్యచేఁ
గసి మదిఁ బెంచి చంపుటకుఁ♦గా మది యుక్తులు పన్ని వ్యర్థులై
విసిగిరొ, యేవి పెన్గదకు ♦ భీతిలి వైరులు తల్లడింతు రా
యసదృశు భీముఁ బందెము జ♦యాస్పదు మామక భక్తునిచ్చెదన్.

దుశ్శా—మామా! పందెమువంతు నీయది.

శకు—ఆడువారు దప్ప మిగులువారు మాటలాడఁగూడదు. అబ్బాయి! ఒక్క పందెము గాదు. ఇక రెండు పందెములు నావి. నకులార్జునుల పందెములు మన పెద్దన్నయ్యగారే వేసినారు. కౌంతేయా! నీ యిష్టముసుమా! ధర్మము సెప్పుము. స్వల్పంబులకై యనృత మాడుదువా ? ఒకవేళ నిప్పటి లేమిడి పురికొల్పునేమో యని జ్ఞాపకము సేయుచున్నాను.

భీము___(లేచి యేదియో చెప్పబోవుచున్నాఁడు.)

అర్జు___(బలవంతముగాఁ బట్టి లాగి కూర్చుండఁ బెట్టుచున్నాడు.)

ధర్మ___సౌబలేయా! కాలము బండిచక్రమువలె ననుక్షణము దిరుగుచుండ గ్రిందు మీఁదను, మీఁదు క్రిందను గాకమానదు. అంత మాత్రమునకై హాస్యవచనంబు లుత్తమవంశోద్భవు లుచ్చరించరు సుమా! పందెము నీవే వేయుము.

శకు___(పందెము వైచును) జయము. జయము. దుర్యోధన సార్వభౌమునకే జయము. పాండుజ్యేష్ఠపుత్రా! యిఁక నీపందెము చెప్పుము.

ధర్మ---ధర్మమే సకల జగంబులకు మూలకారణమని తలంచుచు సత్య నిష్ఠుగాను రాజనీతి యునియు, సర్వసంపన్మనః ప్రాణధనంబులు సకల రాజ్యంబును సోదరచతుష్టయంబును మాయాదురోదరంబున నోడిన యీ యుధిష్ఠిరుండే పందె మగుచున్నాడు.

దుర్యో---ఆహా! పాచికలు చక్కగా దుముకుచున్నవి. ఒక్కసారి కన్నుల నద్దుకొనుము! జాగరూకతతో పందెము వేయుము. ధైర్యము చిక్కబట్టుము. ఉత్సాహవంతుడ వగుము. పాచికల కనువగు కాలము చూడుము.

శకు---అబ్బాయి! సందేహింపకుము. పందెము వేయుచున్నాను. (అని పందెము వైచును.) గెలుపు మనదే. మనదే గెలుపు. (అని చప్పటులు గొట్టుచున్నాడు) యుధిష్ఠిరా! పై పందెము చెప్పుము. అంతయు సరిపోయినదా? ఇక నొక్క పందెము వేయుము. ఏమి యోచించెదవు? మొల్లము కానరాలేదా? పూరిపుల్ల యయిన కానరాలేదా? యోచించుకొనుము, పారజూడుము. తల తడిమి చూచుకొనుము. బుద్ధివంచి యాలోచించుము.

ధర్మ---సుబలసంభవా! నిష్కారణముగ నొకని మనసు నొప్పింప నీకగు లాభ మేమి? క్షత్రియజాతికి గల సహజగాంభీర్యము విడచి నీచజన సామాన్యమగు వ్యర్థప్రలాపంబుల ప్రయోజన మేమి? పిత్రునియోగము విధినియోగ మలంఘ్యమని యెంచి యధర్మమైన నీ కైతవ ద్యూతంబున కొడంబడి రాజ్యసర్వస్వమును, సోదరులను, స్వశరీరమును గోలుపోయిన నన్నేల వ్యర్థపరిభావ వాక్యముల నొప్పించెదవు? కట్టుబట్టలతో శరీరములొడ్డిన మాకడ వేరుధనంబు గలిగిన, నీవు చెప్పుదనుక పందె ముపేక్షింతునా? ధనవిహీనుని, నస్వాస్థ్య చిత్తుని నకారణంబుగ నిందించుట మహాపాతక మండ్రు. ప్రాణములే ధనములుగా గలిగి, ద్యూతనిర్జితుండనైన నా మానస మేల నొప్పించెదవు?

శకు---నీకు స్వాతంత్ర్యము గల ద్రవ్యమే లేదా? నీ సత్యవ్రతమును స్వల్పమునకై వదలుకొన నెంచుచున్నావు. పాపము నీ వేమిచేయు

దువు? నిన్నుబట్టిన దరిద్రదేవత యుట్టిబుద్ధులు పుట్టించును. అనృతంబులకు లోఁబడిన నీ తలపై కెక్కనున్న సామ్రాజ్యముకలదా? చిరకాలార్జితమగు సత్యనిష్ఠను వీడ నెంచకుము. జ్ఞాపకము చేసి కొనుము,

**ధర్మ**—సుబల భూపాలతనూజ! అకారణంబుగ నిష్ఠురవాక్యము లేల పల్కెదవు? ఉరిసిన పుంటిపైని నిప్పుపెట్టినటుల నిర్జితులమైన మమ్ముల మర్మభేదనంబులగు చతురవాక్కులచేత నేల నొప్పించెదవు? ఈ యుధిష్ఠిరుండు ధర్మమునకై ప్రాణము తృణప్రాయముగ నెంచి విడుచునుగాని అనృతంబు పలుకఁడు. బుద్ధిబలముచేత నా మనోనేత్రమునకు గోచరమగు ద్రవ్యమంతయు నొడ్డినాను. పొరపాటున విడనాడిన జ్ఞాపకముచేయరాదా? దానికీ నిష్ఠురభాషణ మేల?

**శకు**—నిజమాడిన నిష్ఠురముకాదా? నీకు ధనము కలిగియుండియు లేదని నిన్ను నొడ్డుకొని యనృతమాడుట మంచిదియె. అనృతమునకు లోనై, తెలియని వానివలె నటించిన నీ శకుని యూరక విడిచి పుచ్చువాఁడని తలంచితివా? నిజముగా నీకు జ్ఞాపకము రాలేదా? పాపము! నీవు మంచివాఁడవే కాని నీకు ప్రాప్తించిన దరిద్రదశ జ్ఞాపకము రానియ్యదు. దీనుఁడవై పలుమారు మరచితినని నీవు వేఁడుటలు చూడ నామనసు కరిగి నీరై పోవుచున్నది. జ్ఞప్తికిఁ దెత్తునా? రాజరాజగు దుర్యోధన సార్వభౌమునిఁ జూచి దాసీ జనంబులతోడఁ గూడి చప్పటులుగొట్టిన రాణీగారు, మాయ వేషమున రాజులనెత్తిగొట్టి తెచ్చి యయిదుగురు పంచుకొని యనుభవించుచున్న మహాయిల్లాలు. తన రాణివాసమునకై విల్లు వీఁగు వీరడి, తండ్రికిఁ బరాభవ మొనరించినవానిని భర్తగాఁ గైకొనిన బుద్ధిశాలిని ద్రౌపది యుండలేదా? ఆమె నీధనంబు గాదా? దేవేరిగారిని బందె మొడ్డి నీవు గెలిచిన సోదర చతుష్టయ సహితంబుగ బంధనిర్ముక్తుండవు కాఁగలవు.

**భీము**—(గ్రుడ్లురిమి శకునిం జంపఁబోవుచున్నాఁడు.)

అర్జు— (బలవంతముగా లాగి కూర్చుండఁ బెట్టుచున్నాడు.)

ధర్మ—గాంధారీసహోదర! యీస్వల్పవిషయమునకా యింత రాద్ధాంతము. మనుజుండన ధర్మప్రమాణవిప్రతిపత్తిప్రశ్నములతో గూడియుండును గదా! ప్రతిపాదమున విడిచిన నా స్వాతంత్య్రమును జ్ఞప్తికిఁ దెచ్చుటకై యీచిన్న నిష్ఠురమును కాంక్షించుచున్నాను? ఇదే పణం బొసఁగుచున్నాను. తిలకింపుఁడు.

ఉ. పాండవరాజ్యలక్ష్మి, సుతపోవనపావనమూర్తి, ధీర, మత్త వే
దండసమానయాన, పతిధర్మపరాయణ, పద్మపత్త్రనే
త్రాంబిని, సాధుశీల, గుణశాలిని, ధర్మవిధానబద్ధ నా
పండితురాలి ద్రౌపదినిఁ బందెము పెట్టెద మత్సతీమణిన్.

అయోనిజయై అగ్నిపుత్త్రికయై శ్రీకృష్ణుని కనుంగుచెల్లెలై మానసంరక్షణాభిమానయగు పాంచాలి సర్వస్వామ్యుండనై పణం బిడుచున్నాఁడ (అని పందెమువైచును.)

శకు—(పందెము చూచి) కురుకులసార్వభౌమా! దుర్యోధన చక్రవర్తీ! పాండవ పంచకపట్టమహిషి, కౌంతేయరాజ్యలక్ష్మి నీ కరగతం బయినది. నా ప్రతిన చెల్లించుకొంటిని. ఇంక నీ యభిమతంబు నెరవేర్చుకొనుము. శుభముహూర్తంబున మయసభాప్రవేశము సేయుము. ధర్మనందనా! జూదమునందలి వేడ్క తీరినదియా? విజయలక్ష్మి మానినే వరించునను గర్వము పనికిరాదు సుమా! కాని నీవంటివానితో నాడినదే యాట మంచియాటగాదవే! ఈ దినమున పాచికలమాహాత్మ్య మడరె. చిరకాలమునకు నా వేడ్క తీరినది. అబ్బాయి! పాండవులు నీకు దాసు లైరి.

దుర్యో—ఓయి పండితంమన్య! విదురా! సలక్షణముగ సిగపయి పువ్వు వాడకుండ, నొకని శరీరమున కాయాసము సంభవింపకుండ పాండవ రాజ్యలక్ష్మి కరగతంబయినది ఇట్టి మా విజయంబు నీవు సహింప లేవు మాకేమో విపత్తులు చుట్టుకొనుననియును, ద్యూతము పనికిరాదనియును నీతిశాస్త్రములు పలుమారు వర్ణించినవారికిఁ

దలవంపులుగఁ బాండవులు మాకు దాసులైరి. కాఁబట్టి సేవకు రాండ్రఁ గలిసి సభాభవన మూడ్చుఁదగు పాండవపట్టమహిషిని, ద్రౌపదిని శీఘ్రంబుగ సభాస్థలికిఁ దోడ్కొనిరమ్ము. ఆలసింపకుము. దుఃఖమందకుము. దయ చేయుఁడు. క్రొత్తచీపురుతోఁ దమవెంట సేవకుని పంపుచున్నాను. నూతనసమ్మార్జనీపాణిగ్రహణ మహోత్సవము ద్రౌపది ప్రప్రథమమున నంతఃపురాంగనా సమక్షమునఁ దమ యాజ్ఞమీఁద ననుభవించి సభాస్థలికి రాఁగలదు.

విదు-(ఇంచుక తీక్ష్ణముగా) ఓయి క్షత్రియకులకలంకా! నీవంటి యజ్ఞానులు లోకంబులఁ గలరా? మూర్ఖుండవై యుక్తాయుక్తవిచారణ మారయక, పెద్దపిన్నల గుర్తెఱుంగ లేక, మత్తగజంబువలె మన్ను మిన్నుఁ గానక, పెద్ద లుండిరను భయములేక నోటికి వచ్చినట్లు, పలుకుచుంటివి. అరుంతుదునకు, నృశంసునకు, మదమలినమనస్కునకు, కుత్సితమార్గానువర్తికి సంపదలు కరగతంబయ్యెను, తొల్లింటి సిరులతోఁగూడ నాశనం బొనరించును గాని యనుభవించుటకు రావు. అన్యాయాగతమైన పాండవలక్ష్మి నీకుఁదక్కనదనుకొనకుము. చిలువవలె గోండ్రించి మునుపటి నీ యైశ్వర్యమునుగూడ వెడల గ్రక్కించునని దలంచుము. నీ కీ ఫలంబు దక్కుట వెదురుచెట్టునకు ఫలంబు గలిగినట్లు నీ వినాశమునకు హేతువుగాఁ దలంచుము. ఓ దుర్యోధనసార్వభౌమా! నీవు చెడెదవని నన్ను నీ వెన్ని నిష్ఠుర వాక్యము లాడినను నెత్తిని నోరువెట్టుకొని పలుమారు లీ విషయము నీతో ముచ్చటించవలసివచ్చె.

క. అవనీతలసామ్రాజ్యో
త్సవమునకును యోగ్యమైన ♦ సతి ద్రౌపది పాం
డవ ధర్మపత్ని నీ కిం
తవమానము సేయ నేమి ♦ యనపాశ్రయమే?

ద్రౌపదినిఁ బణంబిడినప్పుడు మన శకుని చేసిన ప్రోత్సాహము జ్ఞప్తి నుంచుకొనుము. గాలంబున గుచ్చిన మాంసలేశంబును

గాంచి తుళ్ళిపడుచు దానిని మ్రింగుటకై పరువిడి వచ్చి యా గాలంబుతోఁ గూడ మాంసఖండమును మ్రింగునప్పు డా చేప పను సంతసమునకు మేరయుండునా? కాని యా గాలము దాని కంఠము నుండి వెకలించునపుడు గదా దాని తుళ్ళిపడుట? అబ్బాయి! సుయోధన! మెఱిఁగిమెఱిఁగి కోరలనుండి కరంబు గరళంబు వెడగ్రక్కుచున్న పాముల నుసికొల్పి నీ కంఠంబున నేలచుట్టుకొనెదె వోయి! ఇది మంచిమార్గము కాదోయి గండీ! గాంధారేయ! కౌరవవంశనీరసారణ్యంబు తీవ్రశరాగ్నుల మ్రగ్గఁజేయుటకు సహదేవానలంబు దుష్టవ్యాపార వాయువులచేఁ బ్రేరేచకు. నకుల వ్యాఘ్రంబు కోరలు దీఁటుకొనుచు నోరు తెఱచుకొని కౌరవకుల పాంసనభాగ బృందంబుల గొంతుకలు కొఱికి పచ్చినెత్తురు పీల్చ నుంకించుచున్నదని తలంచుము. అర్జునఖగేంద్రంబు గాండీవపక్ష ప్రహారంబులఁ బరపుచు, తీవ్రశరనఖప్రపాతంబులఁ గౌరవకులపన్నగంబుల శిరంబుఁ జిదుకఁ ద్రొక్క వేచియున్నదని తెలిసికొనుము. కౌరవమదమాతంగమృగేంద్రుఁ డగు భీముండు, బాహునటుల ఝుళిపించుచు, శతఘ్నీ పరిమితాయసదండ త్రింబున కౌరవ మదాంధసింధురకుంభంబులఁ బక్కునఁ బగులఁ గొట్టునని యోచించుకొనుము. యుధిష్ఠిరక్రోధార్ణవంబు ధర్మాత్మ సూద్యోత చంద్రోదయంబున నుబికి, పొంగి పొర్లి, యతిక్రాంతివేలాతటంబయి దుష్టగుణక్రూరసత్వసంవల్లిత కౌరవద్వీపంబుల ముంచ నున్నదని యూహింపుము. ఓ ధృతరాష్ట్రా! నీ మనోనేత్రమున నీ పుత్రుని దుండగంపుచేష్టలు గంతులిడుచున్న వని తెలిసికొనుము. ఇటు వినుము.

చ. ద్రుపదతనూజ సాధ్వి యని ♦ రోషపరాక్రమవిక్రమక్రమ
క్షుపితబలాఢ్యు లార్యజన ♦ సంస్తవనీయులు పాండవేయులన్
గుపితులఁ జేయ దౌష్ట్యమునఁ ♦ గుచ్ఛితులై చరియించువారివా
రపగతశౌర్యవంతులుగ ♦ నాజి నొనర్చురె నీసుపుత్రులన్.

కరిగియాజూదరినిగాని సభ్యులనుగాని నీవడిగి తెలిసికొని నేనువచ్చుట లావశ్యకమైనచోఁ గ్రమ్మర నిటురమ్మి. శుద్ధాంతనివాసినిని వెలువడి నీతో వచ్చుటలా తేనికి న్యాయమని తోఁచిన రాక తప్పునా? పోయిరమ్మి. అబ్బాయి! యింకొకమాట. అచ్చట విదురుఁ డుండెనా? నన్నేల సభకు రమ్మనిరో నీకుఁ దెలియునా?

ప్రాతి-విదురప్రభువయ్యగా రచటనేయుండిరి. ఈ నా యుద్యోగము వారికే మొదట నియమింపఁబడినది. కాని యా విదురయ్యగారు మోము జేవురించుకొని యేమేమో యుపన్యసించినారు. అటు పిమ్మట నీ ఘనకార్యమున కేను నియోగింపఁబడితి సేవకావృత్తి సందిగ్ధజీవనంబని దేవేరిగా రెఱుంగనిదియా! అమ్మా! సేవకునకు జూదఁపుటుదంతంబు తెలియదు కావున మీ యానతి నెరవేర్చి వచ్చెదను. (అని నిష్క్రమించవలయును)

ద్రౌప-ఆహా! యేమి కాలవిపర్యాసము. ఈ ఘట మెన్ని యిడుముల వడి సుడివడవలయునోగదా! కృష్ణా! కృపాకటాక్ష ప్రక్షిణితాఖిల సాంసారిక వ్యామోహ తృష్ణా! నీ యనుగ్రహమేకదా సకలలోక జీవసంచల నాధారము. ద్యూతపరాజిత సంచలితమనస్కుండయిన ధర్మరాజుం డెట్టి యుత్తర మొసంగునోకదా? కౌరవనాధుండు శుద్ధాంతనివాసిని రచ్చకీడ్పించునా? అట్లయిన వీరసింహులగు నా పతు లూరకుందురా! ఊరకుండక చేయునదేమి? మోసగాఁ డగు సుయోధనుం డెట్టి దురూహముతోఁ బ్రాతిగామినిఁ బంపెను? లేకయున్న విదురుఁ డేల రాక మానును? తేనిపై నేల కోపించును? ఇఁక నాకు శరణ మేది? మంజువాణివలన దుశ్శాసనుండు శుద్ధాంతమున నన్ను మోసగించు పన్నుగడ పన్నుచున్నట్లు వినియుంటి అందుకనే భానుమతీపరిభృతు లిందుండి యిప్పుడు అవాంతరకార్యవ్యాజంబుల నొక్కరైన లేకుండ నన్నొంటరిగాఁ జేసినారు. ఇప్పుడేమి సేయుదు? గాంధారి సమీపంబున కేగిన ముప్పు వాటిల్లదని గదా నిశ్చయించుకొంటిని! ఇప్పు డేమార్గ

మ్మన బంధనిర్ముక్తురాలను కావలయునో తెలియకున్నది. అనన్య శరణనగు నా కా గోపాలుఁడే రక్షకుఁడగు.

ప్రాతి-(సభలోనికివచ్చి) అయ్యా! మహాప్రభూ! ధర్మనందనా! ద్రౌపదీదేవిగారికిఁగలిగిన సందేహనివారణార్థమొక ప్రశ్నవన్నడిగె. అది నాకుఁ దెలియని కతంబున మరల వచ్చితి. అదేమన, తనోడి ననోడెనా? ననోడి తనోడెనా? సందియము నాకుఁ దెల యనికతంబున సభారంగమున మిమ్మడిగి తెలిసికొని రానాజ్ఞాపించె.

దుర్యో-ఓయి ప్రాతిగామీ! నీ వామె సేవకుఁడవని యెంచకుము. నాయాజ్ఞయయిన దనుము, నీకుఁగల సందియములు సభ్యులముం దర తన మగనినడిగి తెలిసికొనవచ్చు ననుము. శీఘ్రముగా రా మాలయించతి యనుము. రాణివాసపునీటు విడిచి నీవెంటరాగా మా ముదల యనుము. పొమ్ము.

ప్రాతి-చిత్తము. (అని వెడలును.)

ద్రౌప-అదిగో! ప్రాతిగామి తిరిగి వచ్చుచున్నవాఁడు. నేను రచ్చ కీడ్వఁబడుచున్నాను. నా యంతఃపురసౌఖ్యముల కవరోధము కలుగుచున్నది. ఇప్పు డే యుపాయముచేతఁ దప్పకొనఁగలను?

ప్రాతి-(ప్రవేశించి) దేవీ! నీ వడిగిన యర్థంబు నిర్ణయించువారు సభ్యు లయి యున్నారు. వారి సన్నిధానంబున నీ సందియంబులు నీ భర్త నడిగి దీర్చుకొనవచ్చును. సత్వరంబుగ జనుదెమ్ము. తేని యాజ్ఞ నడిచితీరవలయునని, దుర్యోధన సార్వభౌముండు నుడివినాఁడు. దురోదరపరాజయసంచలితమానసుం డగుటచేఁ గాబోలు ధర్మ నందనుండు నిరుత్తరుం డయ్యె. సేవకుని వృత్తియు, జీవితము, కఠినములుగదా! తల్లీ! రాజాజ్ఞ యనుల్లంఘనీయము. అప్రతి హతము. అందుల సేవకులు జీవచ్ఛవంబులు; పరతంత్రులగుట వారి యాజ్ఞ నెరవేర్పక తప్పదు. ఏమి సెలవు?

ద్రౌప-నా గతికి నీవేమి సేయుదువు? నన్ను నీ సోదరినిగా భావించి మఱియొకపరి సభకుఁ బోయి నామాటగా నిట్లు పలుకుము,

అయ్యా ! నేను రజస్వలను. అంటను చేరరాని సమయము. ఏక వస్త్రను. అట్టి యాఁడుది సభాస్థలికి రాఁదగునా ? సభ్యు లంగీక రింతురా రారాజున కిది సమ్మతియా ? ఇట్టి సమయమున నాఁడు వాండ్రను రచ్చ కీడ్చింతురా ? కావున సభకు రాఁజాలనని సభలోఁ జెప్పుము. అనంతర మా విధిచెయ్వు లెట్టివో యట్టులు జరుగును. శుద్ధాంతాంగనలు పుష్పవతులు వెలుపలికి రాఁగూడదు, ఇది శూరుల కనఁగూన మని గూడ వచింపుము. పోయిరమ్ము.

ప్రాతి—చిత్తము. (అని నిష్క్రమించును.)

దుర్యో—ప్రాతిగామి యొంటరిగనే వచ్చుచున్నాఁడు. ఆమె యేదో సాకుపెట్టి యుండవచ్చును.

ప్రాతి-(ప్రవేశించి) అయ్యా ! కౌరవనాథా ! మీ యాజ్ఞ విన్నవించితి. ఆమె రజస్వలయఁట. ఏకవస్త్ర యఁట. అంటను చేరను వీలుకాని సమయమున సభాస్థలములకు రాచదేవేరి రాఁదగదఁట, సభ్యు లంగీకరింతురా యని యడిగినది.

దుర్యో-ఈ పిరికిపంద భీమునకై జంకి రాయబారము సేయుచున్నాఁడు. రాచదేవేరితనము వదలి చాలకాల మైనదని చెప్పుటకు సామర్థ్యము లేకపోయినదా? ఓయువరాజా! దుశ్శాసనా! యీ భీరుఁడు చేత గాని వాఁడు. నీవే పోయి ద్రౌపదిం దోడ్కొనిరమ్ము.

దుశ్శా-సోదరుఁడు దేవర యాజ్ఞ శిరసావహించుచున్నాఁడు. (అని నిష్క్రమించును.)

ద్రౌప-నా కిప్పుడు, స్ఫురించు శకునములుకూడ నాకు రాఁబోవు కష్ట ములనే సూచించుచున్నవి. మయసభావలోకన పరాభవ దందహ్యమానుఁడగు దుర్యోధనుఁ డెద్దియో యవమానము సేయ నెంచియే నన్ను ద్యూతరంగప్రవేశము చేయించుచున్నాఁడు దైవమా ! దీను రాలి నేమి సేయ నెంచితివివో గద?

దుశ్శా-(ప్రవేశించి) ఓ ద్రౌపదీ ! సౌబలుండు రారాజునకు గాను దురోదరంబునననిన్నోడిచికొనియె, నీవు కురూత్తము సర్వమవైతివి.

నిన్నును, పుడమిని, తమ్ములను నీ మొదటిమగఁడు గోల్పోయినాఁడు. కావున నీ విప్పుడు మాయింట దాసీతనంబు సేయవలసినదాన వయితివి. నన్నుఁ బ్రాతిగామిగాఁ దలంపక శీఘ్రముగా సభాస్థలంబున కరుదెమ్ము.

ద్రౌపది— నాయనా! దుశ్శాసనా! విధినియోగమెట్టులో యటుల జరుగఁగలదు. దూరముగ నుండుము. రజస్వలను, సమీపించకుము. ఏకవస్త్రను. గురుజనాధిష్ఠితంబైన సభ కెట్లు రానేర్తును? అబ్బాయి! ఇది తగని పని. పురుషులను పురుషు లధిక్షేపించిన సమానముగా నుండును. నావంటి యబలలపై మీకోపము సూచించుట తగునా? నన్ను విడిచిపెట్టుము.

దుశ్శా—ఓసి, గట్టవాయి! మన పూర్వసంబంధములు కలిపి, దీనపు బలుకులు పలికినంతమాత్రముననే దయకలిగి, యీ దుశ్శాసనుఁడు నిన్ను విడుచువాఁడు కాఁడు, నీవు దాసీపనులు సేయుటకై నియమింపఁబడినావు. గౌరవముగ నీకు మర్యాద లొసంగుటకు కాదు నేను వచ్చినది. అంటితను, ముట్టితను, దగ్గరకుము, రాను, అను రాణివాసపు నీటులు దాఁటిపోయిన వనుకొనుము. ఆజ్ఞకు లోఁబడి వరవుడుతనము సేయుము. నడుమెత్తకుండ సభారఁగ మూడ్చు పనికి నియమింపఁబడియు, గోటు మానకున్నావె!

ఉ. రాణివి గావు దాసి వికఁ ♦ రానని మూల్గినఁ దప్పిపోదు; ని
ర్మాణ మొనర్చెదైవ మిటు ♦ ప్రాచిని నూడ్చెడు దాసిగాగ ని
స్త్రాణవు నీదు భర్తలును ♦ దాసులు ర మ్మిఁక మాటలేల? నీ
జాణతనంబు నీటు నిల ♦ సాగదు గావునఁ గట్టిపెట్టుమా,

రాజాజ్ఞ యయినది. లెమ్ము. ఆలసింపకుము.

ద్రౌపది—నాయనా! మఱందివి; నీ వేమన్న నేమి? నా బిడ్డవంటివాఁడవు. నీ వదినె వరవుడుతనంబువలన గలుగు గౌరవముమాత్రము మీఁది కాదా? మీ యింటఁ జొచ్చిన కోడ లే కార్య మొనర్చిన గౌరవాగౌరవములు మీ వంశమున కేగాని మీకుమాత్రముకావా?

రజోవతినైన నన్నీల నిర్బంధించెదవు ? ఏకవస్త్ర నిట్లనదగునా ? కర్తవ్యాకర్తవ్యములు విచారింపుము.

దుశ్శా-ఇంతదనుక మంచివాఁడనుగాన నోర్చియుంటిని. నీ వెక్కడి వదినవు, నేనెక్కడి మఱఁదిని: దాస్యము సేయుదాని కెద్ది పేరు నిన్నెట్లె పిలువవలయును. దరిద్రపుమొగములకు రాణివాసమా ? యజమానికడ సేవకురా లెట్టి మర్యాదగ నుండవలయునో యట్లు నడువుము. తెలియకున్నఁ జెప్పించెద. ఇక గౌరవము దక్కదు. నడిచెదవా ? నెట్టుకొనిపొమ్మనెదవా ? దాసివి, ఏకవస్త్రవైన నేమి, విగతవస్త్రవైన నేమి ? నడువుము.

ద్రౌపది-అబ్బాయి ! మనంబున నీర్ష్యగలిగిన పౌరుషంబున సాధింప వలయును గాని యంతఃపురాంగనల నమర్యాద సలుపఁ బ్రియ త్నింతురా ? సభాసదనము నే నూడ్చిన నిలుపఁగలదా ? ధర్మాతి క్రమణముకాదా ? మీ యెట్టయెదుట నా పని సేసిన మీకుఁ దలవంపులు కావా ? కావున నీ యుద్యమం బుడుగుము.

దుశ్శా-నీ చదువులు మావద్ద సాగవు. జుట్టు పట్టుకొని యీడ్చుకొని పోయెదను. చచ్చినట్లు నడువుము మాట్లాడకుము. (అని మీఁదకుఁ బోవుచున్నాఁడు.)

ద్రౌపది (భయముతో తప్పించుకొని గాంధారిని సమీపించుచున్నది.)

దుశ్శా-పలుమరు నీ గడుసుదనంపుచేష్ట లుడుగుమని చెప్పినకొలఁది వీధినిఁబడి పరువిడఁజొచ్చితివి. నీ కెవ్వ రడ్డమువచ్చెదరో చూచె దను. (అని జుట్టుపట్టుకొని సభలోనికి నీడ్చి తెచ్చుచున్నాఁడు.)

ద్రౌపది-(సభలోనికి వచ్చి దుఃఖముతో) అయ్యా ! కురువృద్ధులారా ! యేమి యీ యన్యాయము ? దైవోపహతుం డయినను ధర్మనంద నుడు ధర్మమార్గము తొలంగునా ? ఇది తగదని పలుకక మీ రందరు చూచుచుండ, నవిచారపరుండయి, దుశ్శాసనుండు రాజ సూయావభృధపవిత్రవారి ధారలందోగిన యీ కురులుబట్టి యీడ్చుట కేమికతంబు ? సర్వధర్మ విజ్ఞానులయిన భరతవీరుల

వంశము నేఁడధర్మసంపదచే నింత నిందయ్యము కాఁదగునా? జగత్త్రియవిజయభుజవీర్యసనాథులయిన సాధులు గల నే నగతికనయి, యిట్టి పాటులు పడవలసినదేనా? దీనికి నిష్కృతి కలదా? ఇది విధియని యూరకుండుట ధర్మమా? పురుషప్రయత్నమువలదా?

భముఁడు—అకటకటా! యెట్టియిక్కట్టు లుట్టిపడియె. ధర్మనందనుని శాంతిరసంబు, భార్యను, సోదరులను నెంత పీడించుచున్నదో విచారించుటకు వేరకలదా? క్షత్రియజాతియందేగాదు ఏ నీచజాతియందుద్భవిల్లిన మనుజుండైనఁ దన చెట్టఁబట్టిన యిల్లాలి శిరోజము లొకశత్రువుచేత నంటుకొనఁబడ, యీడ్వఁబడుచుండఁ జూచి యూరకుండు హీనుం డుండునా? ఇంతకన్న మగవానికి బరాభవముం డునా; మనుజజన్మ మెత్తి జ్ఞానపౌరుషహీనుఁ డయినవాని నేమనవలయు? ధర్మశాస్త్రము లన్నిటిని తలక్రిందుగాఁ జదివి తగులబెట్టిన దంతియు భార్యను పందెము వెట్టి జూదమాడుట కేనా? పెండ్లామును పందెము వెట్టి జూదమాడుమని యే ధర్మశాస్త్రములయందైన గలదా! పౌరుషములేని శాంతరసమేల? తగులపెట్టుటకా? వెనుకముందు దారయక, చలపట్టి శత్రుకృత కపటోపాయంబుల గుర్తెఱుంగక, యంతఃపురాంగనను పందెము పెట్టి రచ్చకుఁ దలఁబట్టి యీడ్పించిన బుద్ధిశాలినిఁ అగ్రజుండని పూజింప విధి మా నుదుట వ్రాసెను కాఁబోలును. అధర్మాంకురము మొలక యెత్తినతోడనే గోట గిల్లక విడచిన పెచ్చుపెరుగుట గొడ్డంట నరుకుట కభేద్యమగుచున్న ధర్మము ధర్మమని యెంతదనుక నోర్చియుండుదు?

సీ. బహువిధశస్త్రాస్త్ర • భరితంబులై యొప్పు
తేరుల నొడ్డిన • నూరకుంటి
కరిఘటహయచయ • ఖరరాసభాదుల
బందెమొడ్డిన జూచి • పలుకకుంటి
సర్వసర్వంసహా సామ్రాజ్య మంతయు
నొడ్డినఁ గని • యోర్చుకొంటి

భవదాజ్ఞ వర్తించు ♦ భ్రాతృవర్గము నెల్ల
నోడిన జూదాన ♦ నొప్పుకొంటి

శకునికై తవజాలికా, స్తబ్ధమతిని
సకల సామంతరాజన్య ♦ మకుటఘటిత
రత్ననీరాజితాంఘ్రియౌ ♦ రాజవదనఁ
బందె మొడ్డిన భీముఁ డో ♦ ర్వంగగలడె

ఇది దుష్టదూత్యమని యెఱింగియు భార్యను పణంబిడి యాపై మన యెట్టయెదుట పడు పాటులు చూచుచుండిన యన్నగాని పెద్దతనం బుఁజూచిన కొలఁది నోడలు మండిపోవుచున్నది. కోపంబు మితిమీరు చున్నది. రోషంబు వారాశివలెఁ బొంగి పొర్లుచున్నది. భక్తిరస మింకుచున్నది. ఇంక శాంతిలేదు. పుణ్యాపాపములు లేవు. రౌద్రరస ప్రవాహమున సుడిపడిన నా జిహ్వా యథేచ్ఛావ్యాహార దక్షవ్యవ హారమగుచున్నది, గురుజన తిరస్కారాగత ఘోరనరకంబు లాక ల్పాంతమనుభవించెద గాని కన్నులయెదుట నొకనృపకులపాంసు నుండు భార్యను జుట్టుపట్టి యీడ్చుటఁ జూచి భరింపజాలను. ధరింప జాలను. నీతి బాహ్యకార్య మొనరించువాఁడు అగ్రజుఁడే! కాఁడు తండ్రి యైననేమి? గురువైననేమి? శిక్షించుట న్యాయమే. కావున నిట్టికష్టముల కాధార మగుచు, భార్యను పందెము వెట్టితినన్నవాని జిహ్వను చీల్చివైచెద. ఆ నాలుక పీకివైచెద, ఆ వక్త్రంబు మూసె ద, పందెమిడిన యాబాహువు దాహంబుచేసెద, ఆకరంబు నరికెద. ఆ భుజంబు భజించెద, ఆ చెయ్యి వ్రయ్యలుచేసెద ఆ హస్తంబు నస్తమింపఁజేసెద. ఆశయంబు నాశమొనరించెద. ఆ మణిబంధము ధ్వంసమొనరించెద. ఆ వ్రేళ్ళ గుళ్ళగించెద. ఆ రూపుమాపెద... సహదేవా? అగ్నిహోత్రము అగ్నిహోత్రము! (ధర్మరాజుమీఁదికి దుమకఁ బోవుచున్నాఁడు.)

అర్జు—(భీమునిఁ గౌఁగలించి పట్టుకొని) అన్నా! భీమన్నా! స్మృతి దప్పి నదా? పిచ్చిపట్టినదా? పిశాచగ్రస్తుండవైతివా? నీ భ్రాతృభక్తి యడుగంటినదా! నీ జన్మప్రభృతి యగ్రజునిపై కినుకఁబూని యిట్టి

మాటలాడి యెఱుంగుదువా? భార్యాపరాభవనిరీక్షణకోపావేశితమనస్కుండవై నీ వాడు నుడువులు గుఱుతెఱుంగకుంటివిగాని, యిట్టి మాటలు నినోట వెలువడఁ దగినవా? ధర్మనందనుండు సత్యముఁ దప్పిన లోకములు తలక్రిందులు గావా? గ్రహతారకంబులు భూమిపైఁ దొర్లుకాడవా? జగంబులు భస్మములుకావా? ధర్మస్వరూపుఁడగు ధర్మజుని నిందించినవాని కెన్నటికైన నిష్కృతిగలదా? ధర్మతనూజుండకార్యమాచరించెనా? ఆగ్రహామయగ్రస్తుండవై, నీ వాడు మాటలకు పౌర్వాపర్యము లేక, నీరసము లేకపోవుటచే నీరసములై కన్పట్టుచున్నవి. కాని. చక్రవాళావార్యాచలాచక్రమంతయు రజోమయంబైన మన యగ్రజుని మనంబు చెదురునా? అధర్మమునఁ జొచ్చునా? అజాతశత్రుండని బిరుదందినమేటి మగండు. నీ నింద్యవచనముల కర్హుండా? శాంతిని దెచ్చుకొనుము. పెద్దలను గనిపెట్టుము. నీతిని బాదుకొలుపుము. దేహమును పరిశీలించుకొనుము అన్నగారిని చూడుము. నానుడు లాలించుము. వినయంబవధరించి యగ్రజుని పాదములపైఁబడుము. ఇటు వినుము.

"సీ. ఎవ్వాని వాకిట ♦ విభమదపంకంబు
రాజభూషణరజో రాజి నడఁగు
ఎవ్వాని చారిత్ర ♦ మెల్లలోకములకు
నొజ్జయై వినయంబు ♦ నొఱపు గఱపు
నెవ్వాని కడగంటి ♦ నివ్వటిల్లెడు చూడ్కి
మానితసంపద ♦ లీనుచుండు
నెవ్వాని గుణలత ♦ లేడు వారాశుల
కడపటికొండపైఁ ♦ గలయఁ బ్రాకు

నతఁడు భూరిప్రతాపమ ♦ హాప్రదీప
దూరవిఘటిత గర్వాంధ ♦ కారవైరి
వీరకోటీరమణిఘృణి ♦ వేష్టితాంఘ్రి
కలఁడు కేవల మర్త్యుండె ♦ ధర్మసుతుండు?"

ఎంతటి బుద్ధిబలము గలవానికైనఁ గాల మవిలంఘనీయము. విధి బలవంతమయిన మువ్మూర్తులుఁ గర్భవాసాదిక్లేశ మనుభవింపలేదా? సకల బ్రహ్మాండభాండోదరుండగు శ్రీ మహావిష్ణువు బ్రాహ్మణవాక్యబద్ధుఁడయి కదా యవతారాదు లెత్తినది? శ్లో॥ అయమమృతనిధానో నాయకో ప్యోషధీనాం । శతభిషగనుయాత శ్శంభుమూర్ధావతంసః । విరహయతి న చైనం రాజయక్ష్మాశశాంకో హతవిధిపరిపాకః కేనవాలంఘనీయః॥ అనఁగ నొక బొట్టు సోకినంతమాత్రమున నో జరామరణములు లేక సదా యౌవనప్రాయమున నుండఁ జేయు నమృతమునకు నిధియై, సకలామయనాశకంబయిన యోషధీతతికిఁ బ్రభువయి, ఒక్క వైద్యుఁడేకాదు, ఎల్లప్పుడు నూరుగురు వైద్యులతోఁ గూడి తిరుగుచు, మృత్యుంజయుఁడయిన సదాశివు శిరంబున సర్వదా వాసము సలుపు చంద్రునకు క్షయరోగక్లేశము తప్పినదా? కావున నెవ్వఁడు విధిపరిపాకము దాఁటజాలఁడు, విధిబద్ధుఁడయిన వాని నిందించినఁ బ్రయోజనము కలదా? మధియ గజుండు, ధర్మబాహ్యమయిన కార్య మొనరించెనని తిరస్కరించుట న్యాయమా? నీ విట్లు తిరస్కరించుట పలువురకు బరిహాసముకాదా?

సీ. ధర్మతనూజుఁడు ♦ ధర్మమ్ము దప్పిన
ధరణీతలం బెల్లఁ ♦ దల్లడిల్లుఁ
దవిలి సుహృద్ధ్యాత ♦ ధర్మయుద్ధములకుఁ
బరులచేఁ బిలువంగఁ ♦ బడి విభుండు
కడగక విముఖుండు ♦ గాఁడన క్షత్ర
క్షాత్రధర్మంబు లో ♦ కంబునందు
నిలిపెఁ దా నిది పతి నేరమియే దైవ
వైపరీత్యం బైన ♦ వనరఁదగునె
గురుల ధర్మపరులఁ గోపించి ధీరు ల
తిక్రమింతురే త ♦ దీయ నిత్య
ధర్మగౌరవం బ ♦ ధార్మికు లగుచున్న
పరులచేతఁ జెఱుపఁ ♦ బడియె నిట్లు.

కాబట్టి, దైవాగతప్రతికూలంబుల కన్నగారిని నిందించిన శత్రువుల కెల్లిదముకామా? పలువురు తలలెత్తి చూడఁదగు నీ యుద్యమము వలనఁ గలుగుఁ బ్రయోజన మెద్ది? శాంతించి యన్నగారి గౌరవము కాపాడుము.

ద్రౌప—అహో! ఈ నరపతి యాస్థానంబున నొకరైన ధర్మలోపభయంబున న్యాయంబు నుడువ నుంకించకుండిరే! ధర్మపరిపాలకుఁడు రాజు గావున నధర్మంబునఁ గల్గు పాపంబు రాజు నాశ్రయించు. ఆ యధర్మఫలం బనుభవించువాఁడు రేనిఁ దూరందగు. అన్యాయంబుగ నొక్క యాఁడుదాని మానభంగముఁజేయ గమకించు పాపుని ప్రభువు లారసి శిక్షించకుందురా? ధర్మం బధర్మ విరుద్ధం బయి సభకు వచ్చినదానిం దీర్పకున్న సభ్యు లధర్మాచ్ఛాదితు లగుదురు. కామక్రోధంబులు విడిచి యధర్మ ధ్వంసంబు గావించనినాఁడు పాపంబున నాల్గవవంతు సభ్యులను, మరియొక భాగము భూపాలుని జేరును. మిగిలిన యర్ధంబుమాత్రమే కర్తకుఁ జేరునని పెద్దలు వక్కాణింతురు కావున న్యాయవేత్తలారా! నా ప్రశ్నంబున కుత్తరం బొసంగుడు. నా విధి నిర్ణయించుఁడు.

మ. నను మున్నోడెనొ? తానె యోటుబడెనో ♦ నన్నోడ కేయొడ్డెనో
తన సందేం బడి దెల్ప రొక్కరయినన్ ♦ ధర్మంబె మీకొక్క ప్రా
ణిని హింసించుట జూచి మీకుఁ దగునా ♦ నింద్యుండ నీ కిద్ది కూ
డని కార్యంబని తెల్పరైరిగ ప్రచండక్షోభ మే నందినన్.

కావున నో న్యాయవేత్తలారా! ఈ యర్థంబు స్వార్థపరాయణులై పక్షపాతంబు వహింపక, యథార్థంబు వచింప యోచింపుఁడు. శుద్ధాంతవాసినికీ పాటు తటస్థించుట దేశాపాటమని పాటవం బగు బుద్ధిని యోచింపుఁడు.

విక—ఆర్యులార! మునిబృందారకులారా! విద్వాంసులారా! న్యాయవాదులారా! పసివాఁడు పలుకు పలుకులని పెడచెవి నిడక, యిడుములఁబడు పడతి నుడువుల కుత్తరంబిడ గమకింపుఁడు. ఒకని

మొగమాటమునకు నోటువడి న్యాయంబును, వెడలనడువకుఁడు. అగతికయై, యస్వతంత్రయై, ధర్మబద్ధయై, పతివ్రతయై, న్యాయంబు నారయఁగోరు సతీతిలకంబున కుత్తరంబుగా యథార్థంబు పలుకుటకై సందియింపకుఁడు. ప్రభువునకు గోపంబు కలుగునని జంకి, న్యాయవిరోధంబుగఁ గూలికి విషంబుద్రావి, ప్రాణంబులు గోలుపోయి నరకకూపంబునం బడకుండు ద్రౌపది ధర్మద్యూతవిజిత యగునా? కాదా? ఆమె యిప్పుడు రాణియా? దాసియా? ఆమె యంతిపురమున నుండఁదగినదియా? సభాస్థలి కీగతి రాఁదగినదియా? మున్నెన్నఁడయిన నిట్టి యిక్కట్టు లంతఃపుర స్త్రీలకుఁ గలిగినవని వినియుంటిమా? సందియంబు గలిగినతరి నొకదీన ధర్మసంశయ మడిగినపుడు తెలిసిన విషయ మిట్లొకని దయకుఁ బాత్రులుగాఁ జూచి పక్షపాతబుద్ధి వహించి యూరకుంట న్యాయమా? సభాస్థలికిఁ బోరాదు. పోయిన నూరకుండరాదను లోకోక్తి వినియుండ లేదా? అనఁగ సభాంతరాళంబున నొకని యభిమానమును గోరి న్యాయంబు నుడువకున్న దురాత్ముల యముండు పరలోకంబున సహస్రనాగపాశంబుల బంధించి వేయివత్సరంబుల కొక్కొక్కటిగా విడిచెదరని ధర్మవేత్తలు నుడువుచుందురు. సభలో నధర్మంబు జరుగుచున్నపుడు వీరుండయి న్యాయవాది వారింపవలయును. అసమర్థుఁడయిన నటనుండి లేచిపోవలయును. ఈ సభ నలంకరించిన వారందరు వీరులు, ధీరులు, న్యాయవేత్తలు గావున, నీమె ప్రశ్నంబున కుత్తరం బొసంగఁ బ్రార్థించుచున్నాఁడ. (అని కూర్చుండవలయు తిరిగి లేచి) ఆహా! ధర్మదేవతా! కాలము నీకు వాకట్టు కట్టినదో? అధర్మమా! నీవు లోకమందెదురులేక సంచరించుచుంటివా? వేనవేలు మహాజనులుండి నోరు మెదల్పలేకుంటిరే! సభ్యులందరు ధర్మనిర్ణేతలయ్యు ప్రత్తికాయవలె గుడ్లు వెళ్ళబెట్టుకొని, ప్రత్తిరాటములవలె చెవులు దోరిగిలబెట్టుకొని, గుడిమీఁద బొమ్మలవలె గూరుచుండిరి గాని, యొకరైన నిదమిత్థమని న్యాయంబు పలుకఁజాలరైరిగదా! అయ్యలారా! యార్తయై విలపించు నొక యాఁడుదాని కుయ్యాలించి, నిష్పక్షపాతబుద్ధిచే

నొకని యానకు జంకక, సదుత్తరం బీయఁజాలని సభ యుండిన
నేమి లేకుండిననేమి? పెద్దలయెదుట చిఱుతవాఁడు ధర్మనిర్ణయముఁ
జేయుట లధర్మమయినను అన్యాయాశ్రవణవికర్ణుండయిన వికర్ణుఁడు
నిర్ణయింపఁబోవు ధర్మము కామక్రోధంబు దక్క విచారింపఁడు.
జూదమ్మును, వేటయు, పానమ్మును, బహుభక్షణాసక్తియు, నను
నాలుగు దుర్వ్యసనంబులం దగిలిన పురుషుండు ధర్మముదప్పి
వర్తిల్లును. అట్టివాని కృత్యంబులు చేకొనఁదగినవికావు. కితవా
హూతుండై దుర్వ్యసనాసక్తుండగు పాండవాగ్రజుండు పాండవుల
కందఱకు సాధారణధనంబయిన పాంచాలి బణంబు వెట్టుటకు
స్వతంత్రత గలిగియుండునా? అస్వతంత్రునిచేఁ జేయంబడు
కార్యము న్యాయస్థానమునందు నిర్వహింపఁగలదా? ద్రౌపది
యధర్మవిజిత; మఱియు నేకవస్త్ర. అంతఃపుర వాసిని కావున,
నిటకీవిధంబునఁ దోడ్కొనివచ్చుట న్యాయముకాదు. అయ్యాది
సభాసదు లెఱుంగనిదియా?

ఉ. ఎందుకు మీతపంబు జప ♦ మెందుకు నిష్ఠలు యోగ మెందుకో
ఎందుకొ ధర్మశాస్త్రము ల ♦ దేపనిగా పఠియించు టీరిమె
గుందుచు ధర్మసంశయము ♦ గోరినసాధ్వికి నుత్తరం బిడం
దందరలాడు పండితుల ♦ తండము లుండిన యుండ నేమియా.

పిదపకాలముగావున, మీర లుపేక్షించియుండవచ్చును. ముఖ్యముగ
నాసేయు ధర్మనిర్ణయ మిదియ. పాండవాగ్రజుండు పాండవుల
కందఱకు సాధారణధనంబయిన పాంచాలిని పణంబుఁ జేసెఁ
గావున, ద్రౌపది యధర్మవిజిత, యాకోమలి నేకవస్త్ర నిట
దోడ్కొనివచ్చుట యన్యాయంబు. ఇదియ నాసేయు ధర్మనిర్ణయంబు.

సభ్యులు—సత్యము, సత్యము, సత్యము, (చప్పటులు గొట్టవలయును.)

కర్ణు—(ఈర్ష్యతో) ఆహా! ఏమి యీవిలాసము, ఏమిగోల, ఎందుకీ
చప్పటులు, ఎందుకీకేకలు? తెలిసి తెలియని పసిపిల్లని పలుకుల
కింత సంభ్రమమేల? ఆఱుశాస్త్రములు పారజదివిన పండితుల

కన్ననో యవివేకీ! నీ కెక్కువ తెలియునా? నిన్న మొన్న కన్ను తెరచిన నీవు, ధర్మవేత్తలనడుమ చక్కట్లు దిద్దుపాటి శక్తి నీ కెక్కడినుండి వచ్చినది. పెద్దలచే నిండియున్న సభలో నీ కింత గర్వము స్వాతంత్ర్యము పనికిరాదు. నాలుగునీతులు వర్ణించినంత మాత్రముననే పేరు ప్రతిష్టలు కలుగునా? నీవొక న్యాయవేత్త వగుదువా? ద్రౌపది యధర్మవిజితయంటివి. నీ కేమి తెలిసి పలికితివి? ధర్మజుఁడు తన సర్వస్వము నొడ్డి యోటుపడిన నీమె వానికి వెలిగాదు? కావుననే ధర్మవిజిత. ఇట్లు కానినాఁ డీ పాండవులందఱు విజితగ నేల యొడంబడుదురు? మఱియు నేకవస్త్రయైయున్నఁ దీసికొనివచ్చుట యధర్మంబనిగద యంటివి? లోకంబున నాడుదానికి దైవాధిష్ఠితుండగు భర్త యొక్కఁడుండును. గాని పలువు రుండరు. దీనికి ననేకమంది భర్త లుండుటచేత బంధకి యనంబడు. ఇట్టిదాని నేకవస్త్ర యననేల, విగతవస్త్రఁ జేసి తెచ్చినను ధర్మవిరోధంబు లేదు. ఓయి గర్వపోతా! తనకు లేని యధికారము మీఁద వేసికొని గాలివానివలె మోదువడుట తప్ప నీకుం గలుగ కీర్తి లేదు. ఇది మొదలు లేనిపోని పెత్తనంబులు పైనవేసికొనక, యొక మూల నొదిగియుండుము. మఱియు నిప్పటికి మించినదిలేదు, ఈ భీముండు ధర్మరాజు తమ కధికారి కాఁడు. ఈతఁడొడ్డిన పందెము మే మంగీకరింపము. అనినఁ జాలును ద్రౌపదినేకాదు, పాండవు లందఱిని గూడ దాస్యమునుండి విముక్తులఁ జేసెదను. ఇప్పటి భీమార్జునుల సంవాదముచే విజితగా దాని భర్తలే యొప్పుకొనుచుండ నీకీ వ్యర్థ ప్రలాపము లెందుకు? నీచేతనయిన భీమునిచే నామాట వనిపింపుము.

భీము—ఓరి పరదత్తాన్నభోజనమదోన్మత్త! కురుపాండవకలహాలతి కాలవాల! అవిదితనిజబలపరాక్రమపౌరుష! సూతకులవార్ధిబడబానల! వాయెత్తక యొక మూల పడియుండక మాయాద్యూతసమాగత విజయంబుగూడ విజయంబుగాఁ దలఁచి న్యాయవాదియగు వికర్ణుని నిందించుటయేకాక, భీముఁడు ధర్మజాజ్ఞాబద్ధుండు కా దన

వలయునా? అట్లనిపించవలయునా? ఈ భీముఁడు ధర్మరాజాజ్ఞాగళ బంధీకృతప్రాణి కానిచో నీపాటికి మీ శిరంబులు పప్పుపప్పుగ, నలినలిగా, గ్రుద్దుగ్రుద్దున పగులకపోయినవియా? ఈ సభా రంగము శ్మశానవాటిగా మారక పోయినదియా? మీ యాండ్రు తలలు విరియ బోసికొని, నీలిచీరెలు ధరించి, నవేక్షింబున కేగి మంగళసూత్రంబులు పెటపెట, పెటపెట, త్రెంచుకొను సుభ ముహూర్తము సమీపించకపోయినదా? ఓరి దుర్మదాంధ? మా సోదరులు నలువురు యుధిష్ఠిరాజ్ఞాబందీకృతప్రాణులురా! ఈ ధర్మ దేవత మమ్ము ద్యూతమున పందెము పెట్టుటకాదు, మా శిరంబులు గోసి యిచ్చుటకుఁగూడ సంపూర్ణాధికారిగా నొప్పుకొనియుంటి మని తెలిసికొని వచ్చినట్లు పడియుండుము. ఓరి దరిద్ర దామోదర! తేఁకులకడ తచ్చనలుచ్చరించి పెంపుడు కుక్కవలె భోజన పరిత్యక్తాన్నకబళ విమోహితప్రాణివగు నీవుగూడ సభలో ధర్మ సంశయవిచారణ కర్తవగుట భావికలికాలపు చిహ్నములని తలంప వలయు. అగ్రజాజ్ఞాలానబద్ధుండు భీముని వ్యర్థునిగాఁ దలంచి కాలు లరవక, తల వంచుకొని కూర్చుండుము.

కర్ణు—పౌరుషహీనుండు వాగ్వ్యాపారముచే శూరుఁడ నగుదునని తలంచు నీవంటి యసమర్థుల మాటలకు నుత్తరంబు లొసంగఁ బూనుట మావంటి శూరశిఖామణులకు నిశ్చయముగాఁ దల వంపులే, కావున, పెండ్లామును జూదంబు పందెమున నోడిపోయిన పౌరుషహీనుల మా ప్రారబ్ధవశంబునఁ జూడవలసివచ్చినప్పుడు మీ మోములఁజూచి యఘంబు పొందుటకన్న తలవంచుకొని కూర్చుం డుట సంతోషము.

ద్రౌప—ఏకవస్త్రను, పతివ్రతను నిట్లు నిండుసభను నిలువంబెట్టి, నా ప్రశ్నమున కొక్కరును జవాబీయకుండుట పాడియా? అవిజితనగు నన్నిట్లు చేయుట సర్వసంపదలు నశించునని, యించుకైన భీతి వలదా? ...ద్యూతంబున నోడుచుకొనఁబడితినని, రచ్చ కీడ్చుంచుటన ...భౌములకు మర్యాదా? నాయకులా! దుర్యోధనా నేను

దాస్యము చేయుట యావశ్యమని తోఁచినదా? భూపాలా! నీకు గాంధారి యొకటియు, నే నొకటియునా? నాకు పరాభవము తటస్థింపఁజేసిన నీకు వధూనికను కాక పోవుదునా? ఈర్ష్యాసూయాలోభంబులు, రాజులకు క్షేమముకాదు. కావున మత్సరగ్రస్తుండవై, మానవతీ పరాభవకార్యము లొనర్ప యత్నింపకుము. ఈకార్యమపకీర్తినీకు ప్రసంగించునని తలంచుము. నన్ను విడిచిపుచ్చుము.

దుర్యో—ఓసి దాసీ! నిన్ను ధర్మోపన్యాసము లొనర్చుటకుగాఁ బిలుచుకొనిరాలేదు. వాయెత్తక యాడిగ మొనర్చుము. రాజును నిందించకుము. ప్రభునిందకులు, రాజద్రోహశిక్షకుఁ బాత్రులగుదురని తెలిసికొనుము. న్యాయాన్యాయములు విచారించు తెలివి నీపాటి యెవరికి లేదని విఱ్ఱవీగకుము. నీగ్రహచారముచాలక ద్యూతమున నిన్ను పందెపెట్టిము యోడిపోవు మగలు దొరికినందులకు విచారపడుము. మఱియు నిట్టి దుస్థితి నీ కెన్నఁటికిని గలుగకుండఁ జేయుమని దేవునిపైఁ బడి యేడ్వుము. మమ్ముఁలఁదిట్టకుము. శ్లో. అసంతుష్టా ద్విజానష్టా సంతుష్ట ఇవపార్థివః॥ అనఁగ దొరికినంతటితో తృప్తి సెందియుండుట బ్రాహ్మణోత్తములకుఁ జెల్లునుగాని, రాజులకు మాత్రము శత్రువిజయమందు తృప్తికూడదవి నీతిశాస్త్రజ్ఞులు శాసించుచున్నారు. కావున శత్రువిజయమునకై పాటుబడు మమ్ములఁ దిరస్కరించిన దండనార్హురాల వగుదువు. యోచించి మాటాడుము.

విదు-పండితోత్తములారా! యీయమ పలుమారు దీనయై వేఁడుకొను ప్రశ్నంబున కుత్తరం బొసంగక, చూచుచుండెద రేల? నా న్యాయంబు వినుండు. తొల్లి విరోచనసుధన్వులను బాలురిరువురు కలరు. వారొక్క కన్నియం బరిణయంబాడఁగోరి, తమలోఁదాము విద్యలయం దొకరికంటె నొకరధికుల మని పెనఁగులాడి, యందులకు దమ ప్రాణంబులు పందియంబులుగాఁ గొని యావివాదమపనయించుటకయి అంగీరస పుత్రుం డగు సుధన్వుండు, విరోచనుని తండ్రియగు ప్రహ్లాదుని కడకుం జనియె. అప్పుడు ప్రహ్లాదుఁడు

మాధ్యస్థుఁడై వారిరువురిని బరిశీలించి, న్యాయమునకు భంగము కలుగకుండ, తన కుమారునికంటె సుధన్వుఁడే విద్యాధికుడని నిష్పక్షపాతంబుగఁబలికె. సుధన్వుండు కుమారునియందు ప్రేమయైన లేక, న్యాయంబుగ విమర్శించి పలికినందులకు సంతసించి విరోచనునకు ప్రాణదాన మొసంగి చనియెను. కావున మీర లోకని దయకు భంగము కలుగునని జంకక, ద్రౌపది ప్రశ్నంబుల కుత్తర మొసంగ యత్నింపుడు, శకునిచేసిన ప్రోత్సాహంబున ద్రౌపదిని పందెము పెట్టుటకు ముందు, ధర్మజుండు పందె మొడ్డుకొని యోడుపోయెఁ గాన నప్పటికి దానొక్క-దాసుండు. అట్టి దాసునకు పదంపడి మహారాణి యగు ద్రౌపదిని పందియంబు పెట్టువంతటి యధికార మెక్కడనుండి వచ్చినది? కావున ద్రౌపది దూత్యవిజిత కాదు. ఆమె దాస్యంబునకుం దగదు ఇది నానిర్ణయంబు. మఱియు సాధ్వీపరాభవము రాజులకు ముఖ్యముగాఁ గూడనిపని యని యెంచుఁడు.

దుశ్శా—ఓయవివేకీ! స్వజనోన్నత్యాసహ్యాచిత్త! మూఢ! ఇప్పుడు భీముండు పలికిన పలుకులు వినుటకుఁ జెవులు లేకపోయినవా? న్యాయమని దానిమగండే యంగీకరింప, యవనికాంతరహాస్య చర్మపుత్రికా చందంబున నెగురుకొనుచు జకట్లు దిద్దుట కేలవచ్చెదవు? ఇట్టిమాటలిఁక బలికిన మాయన్న సహించినను నేను మాత్ర మూరకుండఁజాలను. అది గ్రహించి వాయెత్తకుము. నా సాహసము కనుగొనుము. ద్రౌపదీపాతివ్రత్యమహిమ నగుపఱచెద. (అని ద్రౌపది పైటను మొలివేసి లాగబోవుచున్నాఁడు.)

ద్రౌప—ఆర్యులారా! పండితులారా! దోషజ్ఞులారా! న్యాయవేత్తలారా! ఈమూఁడుకుత్యాలించుట యన్యాయమని తోచెనా? మీయందఱి హృదయములనుండి దయారసంబు పాఱిపోయెనా? అత్రత్యజనంబులో నాదుబిడ్డలపై కడుపుతీపిగల పుణ్యాత్ముఁ డొక్కఁడైనను లేడా? దుర్మార్గుఁడొక్క ప్రాణిని నిష్కారణము హింసించుచుండ న్యాయమిదియని చెప్పదగిన ధైర్యశాలురు లేక

యుండిరా? భార్యయన భరింపదగినదని యెరుఁగని యరము తెలియని పరమ మూర్ఖులీసభాసదులయి నేఁటికి ధర్మదేవత నాల్గుపాదములు విఱుగఁ గొట్టి పడవైచిరా? వయసు చెల్లి తలయు గడ్డము నఱసి న్యాయవేత్తలమని ధర్మశాస్త్రములు తలక్రిందుగా జదివిన పండిత పుంగవు లస్తమించిరా? లోకము గొడ్డుపోయినదా? ధర్మము వట్టి పోయినదా? ధైరసాహసములు దాచిపెట్టిరా? నీతి బీజంబు లందలి జనగర్భగోళంబులు చవిటిపఱ్ఱలై యంకురంబులు నశించిననా? ఏతండ్రులకైనను, ఏయన్నలకైనను, పుత్రికలును సోదరీరత్నములును లేరా? అంతఃపుర సంరక్షణాభిమానముగల క్షత్రియజాతి మగవారలు భరతదేశము విడనాడిపోయినారా? ఏనాఁడైన నే నీచజాతియందుద్భవిల్లిన యాఁడుదానినైన నొక్క దుర్మార్గుడు, నరపశువు, మానభంగము సేయుచుండ నిట్లు చూచుచుండిరా? ఆఁడుదానిని పరాభవించుచుండ విలాసముగాఁ జూచుచు నాయుధధారులయి పౌరుషవంతులగు పురుషసింహులు కదలక మెదలక విగ్రహములవలెఁ గూరుచున్న ప్రతిమాపత్రి భాసిత రాజరత్నముల గాంచ నా కడుపు మండుకొనిపోవుచున్నది, క్షత్రియాంగన వరప్రసాదజనిత, జగదేకవీరుండని ఖ్యాతిఁగాంచిన పాండుమహీపాలుని కోడలు, అరిజనకాలగ డేరపవమాన సమాన పాండవపంచకపట్టమహిషి. రాజసూయాధ్వరాధ్వర్యు ఋజ్నిర్మ లీకృతవారిధారాపాతపవిత్రీకృత శిరోజ. ధైర్యవీర్య, సాహసాల వాల, భర్త్రాజ్ఞా నిర్వర్తిత సకలకార్యధురంధరి. ఒక్క పౌరుష హీనునిచే, నొక్క దురాగతునిచే నొక్క నరపశువుచే. నొక్క తృణప్రాయునిచే, స్త్రీ పురుషాదులకుఁ జెప్పుటకు జేయుటకుఁ జూచుటకు లజ్జాకరమై, మహాపాతకమై, ఘోర నరకపాతక హేతు వగు కష్ట మందుచుండఁ జూచుటకే సభ్యు లంగీకరించుచుండిరి గదా? స్త్రీ యస్వతంత్ర మహానిర్బంధనిగళ బంధితయై మాన భంగ మందవలసినదియా? లేక యాఁడుది స్వతంత్రిఁ వఁ లసినది యా? పరాభవసమయ సంజాతక్రోధజ్వాలలు, వినిర్గతంబు లగు

చున్నవి. లోకంబులు భూతలంబులగు కాలంబును, వంశంబులు నశించు కాలంబును, క్షత్రియు లడుగంటు వేళయును. క్షత్రియ క్షేత్రంబులు వాడగు కాలంబును, చిరకాలార్జితం బగు రాజవంశ మర్యాదాభూరుహంబును భగ్నంబగునదను సమీపించుట చేతనే మీ రందఱు సాధ్వీ పరాభవాలోకనకుతూహలుల మయితిమని మీహృదయంబుల నిక్కంబుగఁ దలచుఁడు, ఇంక మీకడుపునం బుట్టిన యాఁడుపిల్లలను, కిరాతులు, కొలఁదికాలములో మీయెదుట మానభంగము జేసి, కులభ్రష్టలను జేసి, వారల బలవంతముగ భార్యలఁ జేసికొనుచుండ నభిమానరహితులయి. పరులకు లొంగి, పరాచారపరాయణులై, పరపాలనాధోగాధంబునగూలి, యధోగతి నొందుకాలము భరతఖండ వాసులకు రానున్నదని బలవంతముగ భార్యలఁ జేసికొనుచుండ నభిమానరహితులయి. పరులకు లొంగి, పరాచారపరాయణులై, పరపాలనాధోగాధంబున గూలి, యధోగతి నొందుకాలము భరతఖండ వాసులకు రానున్నదని దలంచుకొనుచుండుఁడు. భారతీయౌన్నత్యము నేఁటితో నేలపాలయినదని మీ వంశ్యులు తప్పక యేడ్చి యేడ్చి హతులగుదురని తలంచుఁడు. అయ్యలారా! పరాభవదందహ్యమాననై పీడితనై, లజ్జావిరహితనై, నిరస్తనారీసమయనై, ఆర్యులకు, శూరులకు మర్యాదాభంగముతో వాక్యములు పలికి యుంటినని నాపై కినుక వహించి దేశవైభవమును. ప్రజాక్షేమంబును, నశింపఁజేయక నాపాపము నన్నే నశింపజేయునని తలంచి నా ప్రశ్నల కుత్తరంబొసంగుఁడు. భార్యను పణంబుఁ బెట్టఁదగిన యధికారము నాభర్తకుఁగలదా! పరిపూర్ణముగా నాపై నధికారమున్నచోఁ దాను రాజుగానుండి పెట్టెనా? ద్యూతనిర్జితదాసుఁడై నన్ను పణం బిడియెనా? నేను రాణినా? వరపుమ కత్తెనా? (అని యొక్కక్షణ మూరకుండవలయును.) ఏమీ యెవ్వరు పలుకరా? కీర్తిని గడించుటలో గండరగండలై యొకరిని మించి యొకరు ముందంజవేయు ధర్మవేత్తలు, ఆచార

పరులు. ధర్మస్వరూపులు, పరాయత్తులయి స్వాతంత్రితలేక పట్టెడు పొట్టకూటి కెక్కడ భంగము కలుగునో యని జంకి వంశనాశకుల యాజ్ఞాబద్ధులయి చిత్రప్రతిమలవలె నోరు మెదల్పలేక సర్వప్రపంచ సృష్టికి గారణభూతురాండ్రగు స్త్రీజాతి నధోగతిపాలు సేయుచుంటిరా? ఇట్లు పేక్షించిన మీజిహ్వలు తృణభోజ్యపదార్థరసగ్రహణంజేయజాలునా? మీరు భుజించిన పదార్థములు జీర్ణంబులగునా? మీ రక్తనాళములు బ్రద్దలయి చిమ్మిన గ్రోవివలె మీ ధైర్య సాహసౌదార్యైశ్వర్యాదుల వెదజిమ్మి పంచముల పాలుగావించకుండునా? వారలకు మీ రూడిగప్రుకాండ్రు గారా? ఈ పరాభవము నాకు మాత్రమా? కాదు, నాకా? పురుషజాతికా? యోచించుటకు మీ హృదయములు నాశనము లయినవా? అహో! భరతదేశమా! అమ్మా! భరతఖండమా! నీ కడుపున నెంత నీచబుద్ధి గలవార లుదయించిరి?

ఉ. భారతదేశగౌరవము ♦ పాడరఁ గాలము వచ్చె లేనిచో
నారిజనాళి గుంపువడి ♦ చూచుచునుండఁగ నిట్లు దుష్టసం
చారుఁడు దుస్ససేనుఁ డొక ♦ సాధ్వికురు ల్మలివేసి యీడ్వఁగా
నోరు మెదల్ప జంకుచు గ ♦ నుంగొనుచుందురె బొమ్మలట్లుగాన్.

కౌరవవీరులారా! భరతమహాభిషక్శంతనులనాఁటినుండియుఁ బౌరుష గౌరవంబును గలిగి పరశురామ గర్వనిర్వాపణచణుండయి భారత కేసరి యని యిప్పటి రాజచక్రంబు ముందటఁ బేరువడసి పాలాక్షు నైన లక్ష్యంబుఁ జేయని బిరుదుమగండై కురువంశాలంకారుఁడగు భీష్ముం డవతరించిన గొప్ప వంశంబున జనించిన మన కౌరవవీరులు తమ యింట, జొచ్చిన క్షత్రియాంగన, శుద్ధాంతనివాసినిని పరిష న్మధ్యంబున కీడ్చి తెచ్చుటా?

ఉ. దీవుల నేడిట న్విజయ ♦ దీక్ష జయించుటా వీరశౌర్యల
క్ష్మీవిభవంబునం దిద్రిశ ♦ శేఖరు గెల్చుటా భూరి శక్తివి
ద్యావిత వైరులాటా సభ ♦ ద్రౌపది నీగతి నీడ్వ నెంచు ట
య్యా! విన ధార్తరాష్ట్రుల మ♦హాశయ మీభువి నిండియుండఁగన్,

ఆర్యులారా! సభలో నింతసేపు నిర్భయముగా నుపన్యసించుట స్త్రీలకుఁ దగదని తెలిసియు దురాగతాహతనారీసమయంబు గలదాన నగుటచే వినువారికి విసువుగనుండిన జెప్ప నుంకించుచుంటి. పది నిముసముల కాల మిండు. విద్యాధికులయి, పరాక్రమోన్నతులయి, ధర్మవిదగ్రగులయి, పౌరుషగ్రామణులయి, బలవజ్జనవిఖ్యాతులయి, ధనుర్వేద గేసరులయి, వీరవరాగ్రియాయులయి పరోపకారపారీణులయి, అభయదానకంకణ చణాత్ప్రాణులయి. విఖ్యాతిగాంచిన నా భర్తలు కాలవైపరీత్యముచేతనో మత్ప్రాగ్జన్మకృతకర్మ మాయావిలాసినీ కిలికించితులగుటచేతనో, శత్రునిర్మితమాయాఁ సాగర నిర్మగ్నులగుటనో, అపూర్వంబుగ భార్యను జూదంబునఁ బణంబిడి యోడినను, సాహసంబున కాలవాలమై, బుద్ధిబలవిశేష బీజాంకురమై, జగదుత్పత్తిస్థితిలయాదులకుఁ బంటచేనయి, పురుష యశోలతలకు మూలకందమగు భార్య స్వాతంత్రించి మానము కాపాడుకొనవలసిన కాలము కావునఁ బ్రాణాధికంబగు గౌరవాభిరక్షణకై క్షణకాలము నన్ను విడువుఁడు. మగవాఁడే స్వతంత్రుఁ డనుకొనకుఁడు. రణప్రాంగణంబు నారీమణు లలంకరించఁగూడ దని తలంచకుఁడు. మీచేతుల నుండు కత్తులే పనిచేయునని యోచింపకుఁడు. సమరంబునకు సాధ్వు లసామర్థ్యు లనుకొనకుఁడు. అబలలు ప్రయోగించు బాణంబులు పురుషప్రాణములు దీయఁ జాలవని యెంచకుఁడు. సభాసదుల కధర్మకళంక మంటకుండుఁ గాతయని గోపాలునిం బ్రార్థించి,

మ. సతికిన్ మానము దూలువేళఁ బతియా ♦ జ్ఞం గోరకే దుష్టసం
తతి మాయించుట శాసనం బగును గా ♦ నన్ వీరపత్నీకర
స్థితఖడ్గాంచితతైక్ష్ణ్యధార గన సంసిద్ధుల్ ద్వరన్ రండు రా
ట్తతి గొంతుల్ తెగఁగోతు లేనియెడలన్ ♦ దాస్యంబునేసల్పెదన్.

క్షత్రియులకు యుద్ధజయము లోకద్వయకీర్తిదాయకము. కావున నాభర్త జూదంబున మీరోడిన రాజ్యంబును తూత్రంబుగ నేను

సంపాదించుకొని రాణి నయ్యెదను. చేతకానిచో దాసినై వరవృష తనంబు నేసెద.

భీష్ముఁడు—ఎంత దుష్కాలము సంప్రాప్తమయినది.

మ. సుదతీ! నీ వనుమాటల న్వినుచు భీ ♦ ష్ముండిప్డు ప్రాణంబులన్
వదలన్ జాలకయున్నఁ జచ్చినటులే ♦ భావించు దుర్యోధనుం
డుదయం బొందిననాఁడె ♦ కౌరవకులోన్మూలంబు గావించునం
చెద నూహించితి పెద్దలిప్డు ♦ డదియే యేతెంచె నీవాక్తతిన్.

తల్లీ! యంతఃపురాంగనలు వీరశిఖామణుల యెదుట గౌరవ సంరక్షణార్థము రణప్రాంగణంబునకుఁ బిలుచుచుండ వినియు, చూచియు నిర్జీవప్రతిమవలె నచలనమై భవిష్యత్కాలిధర్మంబుల స్మరించుకొనుచు, మా విషాదంబు దిగమింగుచు నుండవలసిన కాలము వచ్చినది. అధర్మముఁ జూచుచు నిట్లు జీవించియుండుమని బ్రహ్మ మాఁదుపంక్తులు పెట్టి మా నుదుట వ్రాసినాఁడు. స్మయదూషితులగు ప్రభువులకడ పండితుల, మానసాకరమున నుత్పన్నములగు నీతిరత్నములు కూపాంతరపాతంబులగు ముత్తియముల చందమున నిష్ప్రకాశములయి యకళ్యావాసులకడ నుండు కుంభికుంభవినిర్గతంబులగు ముక్తాఫలంబుల వలెనె నిరర్ఘంబులు గాక సార్ఘంబులగునా? సాహంకారులగు రాజులచేఁ పరిపాలితంబులగు రాజ్యములు ప్రజలకు కారాగృహములవలె బంధహేతువులుగాని బంధనిర్ముక్తసాధనములు గావు. అట్టి నిర్బంధ విముక్తి గోరిన నిప్పుడు కాదు, భవిష్యత్కాలమునందైన శాంతిని వహించిన మీవంటి సాధ్వీలవలననే కాని దేశంబు శుభస్థితిలోనికి రాఁజాలదు. నీ వాగ్రహించిన మేమేకాదు లోకంబులు భస్మంబులు కావా? ఒకప్రాణి సహింపఁజాలని కష్టము లనుభవించినను పలువురు సుఖమందుట నాప్రాణికి క్షేమముగాని, ప్రారబ్ధానుగతమగు తన కష్టమునకై పరుల నిందించుట లుత్తమధర్మములు కావు. సాధ్వీ! విధివిధాన మప్రతిహతమని తలంచి ధర్మమూరసి వర్తింతువని యింత వట్టు పలికితిని. ధర్మస్వరూపుండగు ధర్మజునికన్న నీ రేడు

లోకంబుల ధర్మనిర్ణయంబుఁ జేయువారు కలరా? తల్లీ? యాతఁడే శకుని కైతవంబున బొనుంగువడిన చిత్తంబు గలవాఁడై దురోదర గ్రస్తామయ పీడితుఁడై యుండ నోరులు వాయెత్తగలరా? కురు రాజసభాంతరాళంబున విదురున కొసంగిన నివాళిపళ్లెరంబుల గనుం గొని మారాడువారెవ్వరు? ప్రాక్తనకర్మఫలంబుఁ దప్పింప నేరికి వలనుపడు? మఱియు దురభిమానగ్రస్తులగు వారు హితుల హిత వాక్యములకుఁ జెవియొగ్గుదురా? ప్రాణమునకంటె నెక్కుడగు మానసంరక్షణార్థము స్త్రీలు స్వతంత్రించుట యధర్మము కాదని నిశ్చయముగాఁ జెప్పెదను. కాని: భర్త యసామర్థ్యుఁడయిన నట్లు చేయుట యుత్తమము. నీభర్త ధర్మబద్ధుఁడయి అట్లూరకుండెను గాని యశక్తిచేఁ గాదు. భర్త సంరక్షించుచున్న ధర్మమును కాపాడుటయే భార్యకు పరమధర్మము. ప్రారబ్ధములగు కర్మలు భోగనాశనములు గాని యన్యమార్గధ్వంసితములు గావు. అర్హుడో యనర్హుడో భర్తను జేనినిఁ దిరస్కారముగాబలుకుటకన్న మానము వహించి యుంట నీవంటి యిల్లాండ్రకు శ్రేయస్కరంబు సుమా! ఇది యీ భీష్ముం డుపదేశించుట కాదు. జ్ఞాపకము సేయుటకా దలంపుము.

ద్రౌపది—(తలవంచి మొగమున కోపము అసహ్యము చూపించుచు నిలువవలయును.)

కర్ణు—గడుసు పెండ్లా మన నిట్లుండవలయు. రచ్చకెక్కి నిర్భయముగ వ్యవహారములు నడుపఁగల్గు పడఁతుల నంతఃపురబంధనాగారముల నిర్బంధించిన పిచ్చియెత్తిన వానరములవలె బహిస్సంచారపరాయణ స్వాంతలయి సమయము వచ్చిన వీధిని బడనెంతురు. సహజముగ నీవు వీరపుత్రి వందమా? వైరికరకృపాణసాధ్వసీకృత శిరోజుండు ద్రుపదుండు లోకవిదితపరాక్రమవంతుఁడు కదా? వీరపత్ని వందమా? ద్యూతనిర్జితదాసులై, దురభిమానవిఫలీకృత శౌర్యులగు పాండవపంచక పట్టమహిషివిగదా? ఓసీ! పాంచాలీ! దూరీకృతాభిమానవై, నిరంకుశ సాహసప్రకటన పాండిత్యనిపుణవై

సభాస్థలంబున నాట్యంబుసల్పు నటకాంగనవలె, త్రిప్పుకొనుచు మహాంకాళివలె కేకలు వేయుచు, ఖడ్గము పట్టెదనన్న మాత్రము ననే శూరాగ్రేసరులు దిగులొందెదరని యెంచితివి కాబోలు! ఓ! పంచభర్తృకీ! హఠాచ్ఛిద్రతాస్యమనోవ్యథచే పరిషద్రంగ మనుమాటమఱచి వీర వరుల నూదవిద్యావిశారదులుగా నెంచి నిర్లక్ష్యముగా మాటలాడసాగితివి. లజ్జాకరము పాపము నీ వాక్యములు నీ భర్తను మఱింత పౌరుషహీనునిగాఁ జేయుచున్నవి.

మ. వెరపా? లజ్జయు? మానమా? తగవ? గం భీరప్రలాపంబులా? పరధర్మార్థవిచారణంబ? సభలా? వా ♦ క్యార్థమా? యుద్ధమా? తరుణీ! భారతదేశగౌరవము ద ♦ గ్ధంబంద నిట్లాడెదే కురురాడ్భూమిధవుండె భర్త యిఁక నీ ♦ కు న్మాకు శాతోదరీ!

పాపము పిడుగువంటి దాస్యవ్యాపారము నీతలపై నిడిన భర్తలపై జూపఁదగు వ్యాసహారపారుష్య మీ సభాసదులపై చూపించి దుఃఖమును శమింపఁజేసికొన నెంచితివి గాఁబోలును నీతోడ రణవ్యాపార మొనరింప దుర్యోధనరక్షిత సాహంకారులగు పాండవులకన్న వినిర్గత మందాక్షు లెవ్వరు? ద్రోణశిష్యాగ్రగణ్యాయు లయిన భీమార్జునులనే రమ్మనుము. పరువడితనంబునకు నడుము బిగించుకొని దాసి వగుటచేఁ గర్తి బట్టుట కధికారము లేదుగాని, సమ్మార్జనీ మూలంబు గ్రహించి పరాగచయంబులపై పరాక్రమంబుఁ జూపింపుము. యువరాజా! వెనుకంజ వేయుచున్నావేమి?

దుశ్శా—ఓసి! పసువా! దాసివై యుండి రాచపోకడలు మానక తేనివై కారు లఱచుచుంటివి. నీ శాపనాకారములకు జంకి, నిన్ను విడుచు పంద లిందెవ్వరును లేరు. నీవు సత్యవాణివైన నీ కీ మైదు గురు మగల ప్రాంతి యేమి? నీ కీగతి యేల పట్టును? మానహీను లయి నీ మగలు ద్యూతమున నోడి నిన్ను మా స్వాధీనమొనర్చిరి. నిన్ను వివస్త్రను జేసిన నడ్డుపడు మగవానినిఁ జూపుము? నీకు దిక్కు గలిగినఁ జెప్పుకొనుము, మయసభాభవనమున మా దుర్యోధన సార్వభౌమునఁ జూచి నవ్విన చిలుకనవ్వును సభాసదులు

చూచెదరు. మఱియొకమాఱిప్పుడు నవ్వేము. పౌరుషము గల మగవాఁడు కనులయెదుట భార్యను పరాభవించుచుండ, ధర్మము ధర్మమని యోర్చుకొను మగవాఁడుండునా? పౌరుషహీనుల చెట్టఁ బట్టిన మగువగతి యింతదిగా నెఱింగి దేవుఁడు నీ మొగమున బహు భర్తృకవు గమ్మని వ్రాసినాఁడు. నీ కర్మ బాగుగా నుండిన నొక పౌరుషవంతు నాశ్రయించుము.

భీము—(కోపముతో) ఆర్యులారా! కురువృద్ధులారా! నిరంతర సత్యనిష్ఠాగరిష్ఠుండగు యుధిష్ఠిరసోదరుఁడగు భీముండు పలుకు పలుకులు సావధానులై యాలింపుఁడు. ఈ యంధనృపాలాధిష్ఠితంబైన సభాంతరాళంబున జరుగుచున్న మహాఘోరపాతకంబుఁ జూచి మైమఱచుటచే నింద్రియంబు లస్వాధీనంబులయి మానసము దుఃఖాక్రాంతమగుట చేతను, పతివ్రతా పరాభవసందర్శన కుతూహలులయిన దుర్మదాంధుల సన్నిధానంబున ధర్మాతిక్రమణం బొనరించినఁ బెద్దలు నన్ను క్షమింతురను నమ్మకమున నింతదనుక యుధిష్ఠిరాజ్ఞాపాశబద్ధుండనయ్యును, జయపరాభవ నిరీక్షణకోపాశుశుక్షణి విక్షేపరూక్షజ్వాలాక్షిప్తుఁ డగు భీముఁడు. గర్వోద్ధతుండయి అగ్రజాజ్ఞాలానబంధంబు పెకల్చుకొని విడఁబడి సాహసంబు జూపుచున్నాఁడు

ఉ. అన్న సహింపజాలను మ ♦ హాగ్రహవేగము ధర్మపద్ధతుల్
మన్నయిపోవనీ మఱియు ♦ మండని నుండని లేకపోవనీ
కన్నులఁ జూచి భార్య నొక ♦ కష్టుఁడు బట్టలు విప్పుచుండ భీ
మన్న సహించునే రిపుని ♦ మాడ్చఁడె వానిని మంట గల్పఁడే!

ఆహా! యేమి కాలవిపర్యాసము. ఏమహాసాధ్వి పతివ్రతాకులాలంకారమై మధ్యమలోక జనంబులకు ప్రాతఃకాల స్మరణీయులగు సాధ్వీలలామలలో గణియింపఁబడెనో, ఏయపాంసులాశిరోమణి వేదమంత్రహుత హవ్యవాహనోద్భవయై, యయోనిజయన జగంబుల ఖ్యాతిఁగాంచెనో, ఏసతీరత్నంబు పాండవపంచక పరివేష్టితయై, అసూర్యంపశ్యయై దిగ్విజయ పరాక్రమోపార్జితభూపాల శిరోవిల

శత కిరీటకోటీరసంఘటిత రత్నమరీచిభూషితపాదారవిందయై ప్రకాశించెనో, ఏ యువతీరత్నంబు రమారమణ పాదారవిందాక్రాంత మనీషమై చెలంగెనో, ఆపతివ్రతాతిలకము, ఆహీరశక్తి, ఆవిద్వేషత్కాల రాత్రి, అవిదుషీమణి, ఆర్తయై, అనాథయై విలపించుచుండ,

ఉ. ఆ వనజాననం గురుకు ♦ లాపసదుండు గడంగి రాజసూ
యావభృథంబు నందు వసు ♦ ధామర మంత్రపవిత్ర వారిధా
రావళి చేసి పావనము ♦ లైన శిరోజములన్ గ్రహించి పా
పావహుఁ డీడ్చి తెచ్చెను భ ♦ యంకరవృత్తిని జూచియుంటిరే!

వాతవేగావధూతం బయిన పతాకవలె దుశ్శాసనాకృష్టవేణియై, వివర్ణయై, కోపలజ్జాపరవశయై, యగతికయైన భార్యను జూచి యూరకుండిన పురుషుండు నికృష్టుండు గావున దుశ్శాసనకంఠవిలుంఠనం బొనరించుచున్నాఁడు (అని యేగుచున్నాఁడు)

ధర్మ—(భీముని పట్టుకొని యాపుచున్నాఁడు.)

భీము—భవదాదృతధర్మోపదేశార్గళంబు రిపువధోద్యోగవిస్మృతమానసుండ నైన నన్నరికట్టుచున్నది గావునఁ గాలనిరీక్షణ మపేక్షించి ప్రతినఁ జేసెద వినుండు.

మ. కురువృద్ధుల్ గురువృద్ధబాంధవు లనే ♦ కుల్ చూచుచుండ న్మదో
ద్ధురుఁడై ద్రౌపది నిట్లు సేసిన ఖలుం ♦ దుశ్శాసనున్ లోకభీ
కరలీల న్వధియించి తద్విపులవ ♦ క్షశ్శైలరక్తౌఘని
ర్ఝర ముర్వీపతి సూచుచుండ నని నా ♦ స్వాదింతు నుగ్రాకృతిన్.

ఉ. కొట్టెద బొమ్మ బ్రద్దలుగ ♦ గుండెలు కండలతోడఁ బండ్లచేఁ
బట్టి పెకల్చి రక్తమును ♦ పానము సేసెద లోని ప్రేవులన్
జుట్టెదఁ గంఠమాలగ న ♦ నుం గనువారల కద్భుతంబు గాఁ
బట్టి రణాంగణంబునను ♦ పాతకు రక్తము మేనఁ బూసెదన్

రక్షఃకులపాంసనుండగు హిరణ్యకశిపుని భీకరకరాళానర్గళవినిర్గతజ్వాలాభీలుండగు నరసింహుండు నఖంబుల వక్షఃకవాటంబు బ్రద్దలుచేసినట్లు ద్రౌపదీకేశాంబరాకర్షణ మహాపాతకిం బట్టి హృదయకవాట నిర్భే

దసం బొనర్చి, రక్తమునుష్ణధారపానకమువలె బొట్టనిండఁ బట్టిం
చెద. అల్పజలాశయంబున. నీచులగు జెస్తలు జల్లిచేపల దేవినట్లు
దుశ్శాసనోదరంబు గరజాయుధంబునఁ గుళ్ళగించి మాంసలేశంబు
లం గలసిన రక్తంబు కాశ్మీరదేశాగతకుంకుమాపంకిలంబగు చంద
నంబు వడువున నా మెయినిండఁ బట్టించెద. దుష్టమార్గగత దుశ్శీలు
లగు కౌరవసోదరులు రారాజు దుర్యోధనసాహాయ్యముండు చూచు
చుండ మహాసాధ్వీశిరోజాకర్షణాసక్తుండగు యువరాజాధముంబట్టి
యీగదచే పంచాస్యంబు మదగంధసింధురకుంభంబువడువున వీని
తల పక్కలు పగులఁగొట్టెద. ఇందులకుం దప్పినఁ బితృపితామ
హుల గతికిం దప్పినవాఁడను. గురుజనావధీరితసంజాత పాపలోకం
బుల కేఁగువాఁడ మఱియు నో ద్రౌపదీ, వెఱవకు కోపావేశంబున
మఱచితి, ఇటు వినుము.

ఉ. ముదునకు నీదు కేశి నిడి మూర్ఖుని, ♦ నీచుని, దుస్ససేను భీ
ముఁడు వధయించి రక్తమున ♦ ముంచిన చేతుల నీశిరోజముల్
వడివడి జక్కఁదీసి ముడువంగల ♦ ధీరుఁడు చూడు మాటఁ ద
ప్పఁడు సతి ధర్మజాజ్ఞ నిటు ♦ వ్యర్థుఁడుగాఁ గనుపట్టె నీసుఁడై.

దుశ్శా—అశక్తగర్జనవాక్యంబుల కలుక వహింపరాదు. నాపనిలో
నేను జాగు సేయువాఁడ నయ్యెద. అర్థశూన్యంబులు వ్యర్థఫలంబులు
గదా, యున్మత్తప్రలాపంబులు? ఓసి దాసి! రా: (అని వస్త్రము
నూడఁదీయ లాగుచున్నాఁడు.)

ద్రౌప—(వస్త్రమును పట్టుకొనుచు విచారముతో) ఆహా! తుదకు
నాయవస్థ విషమస్థితిఁ జేరును. సభ్యులుపేక్షించిరి. భర్తలా కాల
నిర్జిత బలాహంకారులైరి. భీష్ముండతటివాఁడు దుష్టరాజునకు
నొక్కచెప్పజాలక నన్నే మందలించుటకై ప్రారంభించినాఁడు
ఇప్పుడు నేను పతివ్రత నగుదునా? కానా? సందేహమేల? నా వ్రత
మును పూర్తిగా నాచరించుట లేదా? లోప మొనరించితినా? లోప
మొనరించకుంటినేని, యీ సతీ ధర్మమే నాకు శరణ్యము. ఇంక
నాకు వేరు దిక్కేల? యుద్ధమేల? ఈ సభ్యులతో ప్రసంగమే

ధర్మము వేదచోదితమై, వేదము సత్యమై, జగన్నాటక మాయాయవనికాంతరవర్తియగు పరమాత్మయే శ్రీకృష్ణుండై యుండ, ధర్మముననే సూర్యచంద్రాదులు తిరుగుచుండిన౯ బంచభూతసంచయవ్యాపారములు ధర్మముననే జరుగుచుండిన నట్టి ధర్మరాశితో నొక్కటియై సతీవ్రత మాచరించుచున్న నన్నీ మూర్ఖులు, ఈకుమానా స్వరూపులు, ఈదయాశూన్యులు, ఈ నీచు లోపరించు బరాభవమున నాప్రాణమానములకు నీషణ్మాత్రము వైపరీత్యము సంభవించిన సూర్యచంద్రాదుల గమనంబులు వ్యత్యస్తములు కావా? భూమ్యాకాశము లేకమయి నన్ను ముంచివేయనా? గిరులు సపక్షంబులై యెగిరి నాతలపైఁ బడవా? మారుతుండు స్వస్వరూపంబులు గైకొని నన్ను లోకాంతరంబుసేర్పడా? సప్తజిహ్వుండు తీవ్రజ్వాలలం బరపి నన్ను మాడ్పఁడా? సకలప్రాణిహృదయాంతర్వర్తియై సంసారసాగరతరణోపాయతరిణియై, ఆర్తత్రాణ పారీణుఁడై అనాథ జనరక్షణుండయి విశేషించి నాకు సోదరుండయిన శ్రీకృష్ణుండు పేక్షించునా? కృష్ణా? భర్తపాదసేవయే పరమైశ్వర్యంబుగాఁ దలఁచి మనోనాథుని పాదతీర్థమె గంగాతోయంబుగా నూహించి పతిసందర్శనంబే పరబ్రహ్మదర్శనంబుగా భావించి, యాత్మనాథు సుఖదుఃఖంబులు నా సుఖదుఃఖంబులుగా నెంచి జీవితేశుని వాక్కులు వేదవాక్కులుగా స్మరించి రేయుంబవళ్ళు తలంచునప్పుడు, చెప్పునప్పుడు, చేయునపుడు పతిసేవా పరాయణురాలనయితినేని దుర్మదాంధుల సాహసిక వ్యాపారంబుల లోకములు భస్మములు కావా? పుణ్యలోకంబు లల్లాడవా? బ్రహ్మాండములు ద్రొల్లవా? సూర్యుడు సర్వదా యస్తమించఁడా? యమలోకంబు వడంకదా? మునిమూర్తులు పసిపాపలు కారా? శత్రువులు నశించరా? శ్రీమహావిష్ణు వవతారంబులెత్తఁడా? ఇట్టి విపరీతంబులు సృజించిన పతివ్రతల పేరులు నాశనములు కావా? ఈ దురాత్ముఁడు, నాకు దిక్కుగలదేని చూచుకొమ్మనిగదా వస్త్రము లాగుచున్నాఁడు. మామకీన హృదయాంతర్వర్తియగు పరమాత్మ శ్రీకృష్ణుండు భగవానుఁడే దిక్కు- భక్తపరాధీనుండు దిక్కుఁగాఁడా?

మ. బలవంతు ల్గుణవంతు లార్యజను లే ♦ నాతంత్రియుమస్త్రశస్త్ర వి
స్త్రులధీమంతులు వైరివీరకులసం ♦ స్తోమాంతకాఢ్యు ల్పతుల్
చలమూనన్ దమభాగధేయము సభన్ ♦ జాయాపణద్యూతసం
చలితాత్మార్థవిగర్వులైరి గను కృ ♦ ష్ణా! దీనసంరక్షణా!

మ. ఎవరిం జేరగనేర్తు రక్షకులు నా ♦ కేరీ దయంబోలిన ది
క్కేవ రీఘోరపరాభవార్చులకు నె ♦ ట్లే దప్పుమన్ జాలిదా
ల్పవె కాపాడవె దుఃఖమార్పవె దయ ♦ న్పాలింపవే దీనబాం
ధవ! యార్తావన! ద్వారకానిలయ! ♦ కృష్ణా! దీనసంరక్షణా!

మ. ఖలుం డివేళ సభాంతరాళమున వీం ♦ క న్బట్టి నా కట్టు బ
ట్టల విప్పం జతనంబు సల్పు నృపసంత ♦ న్మాన్పంగా లేక భ
ర్తలు భీష్మాదులు చూచుచుండి రిట నా ♦ ర్తత్రాణపారీణ చె
ల్లెల్లు దుఃఖాబ్ధి మునింగె, నీమదిని జా ♦ లిం గొల్పు కృష్ణా! హరీ!

శా. హాకృష్ణా! జగదేకబంధు! సదయా ♦ యార్తార్తినిర్వాపణా!
లోకారాధ్య! మహాప్రభూ! నతదయా ♦ ళూ! దీనమందారమా!
నీకన్నన్ గతి లేదు ద్రౌపతి మహా ♦ నీచస్థితిం జొందె వే
సాకన్ రమ్ము దయాబ్ధి! ద్వారకపురీ ♦ సంస్థాన! కృష్ణా! హరీ:

శ్లో॥ నందాదిగోపజనమందార మంతరిత కుందిమాల్యానికరం
మందాకినీసలిల బృందాళిరూపిత సునందామృతైకచరణం
బృందారకప్రముఖ సందారితారిఘనబృందాటవీదహనం
వందే కృపాబ్ధి తన పాదారవింద లసదానందపాంసుపటలం.

ఏమి నాకు దిక్కు గలిగినం జెప్పుకొననలయునా! ఓయి! నా పాతి
వ్రత్యమే నాకు దిక్కు. అంతకన్న బలమగు దిక్కు గలదా? అది
చాలదా? చూచు నీవు [illegible]

మ. హరియో శంకరుడో [illegible] ♦ [illegible]నాథుడో
ర్జరులో సూర్యుడో చ[illegible] ♦ [illegible]బక్షయు
త్తిజీ నామానము గావ రాదొకో [illegible] ♦ [illegible] వస్త్రము
వెరపా సాధ్వికి నీకు చేతనగునా ♦ విప్పంగా నావస్త్రముల్ ?

మ. సతినై కృష్ణపదాబ్జ భృంగమతినై ♦ సత్యవ్రతాచారసం
గతినై భర్తృమనోనుకూలగతినై ♦ కాపట్యరహితస

ద్రోహినై యుంటినయేని ద్వారకపురీ ♦ వాసుండు శ్రీకృష్ణుఁ డీ
స్థితి నామానము గావ నక్షయములౌ ♦ చీరల్వడిన్ బంపఁడే.

శా. పాతివ్రత్యము ధర్మమై యదియు నే ♦ పాలించుటే సత్యమై
చేతం బెప్డు మనోధవార్చనకథా♦సిద్ధాంతకల్లోలినీ
యాతాయాతరహస్యవీచికల నె♦య్యంబొప్పదో గాదు నీ
ఖ్యాతింగాంచిన నే వివస్త్రనయినం ♦ గగ్గోలుగావే భువుల్.

(అని విస్మృతిఁ జెందుచున్నది)

దుశ్శా— (కొన్నిబట్టలువిప్పి) ఓసిదాసీ! ఇందునకా ప్రాతిగామిని నాలుగు మారులు త్రిప్పినది, గుడ్డపై గుడ్డ కట్టుకొనుటకా! నీ మాత్రపు గారడి తనము తెలియనివా రెవరు? ఖురలీతలపరిశ్రమ మాంసలభుజార్గళుండగు దుశ్శాసనుండు వస్త్రములు విప్పఁజాలక పోవఁడు. ఎన్నిబట్టలు కట్టితివో చూచెద.

ద్రౌపది— నా వస్త్రమును హరించుచుంటివా? హా! దయామయా! నామస్మరణ మాత్రభస్మీకృతపాపసంచయా! అయోనిజనై వీర పుత్రినై, వీరమాతనై, ధీరవీరపత్నినై, భవత్పాదారవిందార్పిత మానసనైన నాకీ కష్టకాలంబున, నీ యాడుపడుచు సభాంత రాళంబున మానభంగము నొందుచుండఁ గాపాడవా? ఓ నంద నందనా! మానము—ప్రాణము—పరాభవము— (అని నిశ్చేష్టితు రాలగుచున్నది.)

దుశ్శా— నీ ప్రార్థనలకు దేవుఁడు దిగివచ్చుచున్నాఁడు (అని విప్పు చున్నాఁడు)

కర్ణు— ఓ యదృష్టహీనురాలా! నీ యిడుములు కనులారఁ జూచిన కొలఁది నా మనము మిక్కిలి ఖేదమునొందుచున్నది. గొప్పయింటి బిడ్డవు. సిరి గలదానవు పాప మాగాండీవిచే బరాభవింపఁబడిన నీ తండ్రి తన మానసంరక్షణార్థ మీ పాండవుల నల్లుండ్ర జేసు కొనఁ దలంచి నిన్నీ ద్యూతనిర్జితదాసులగు మానహీనుల కంటఁ గట్టినాఁడుగాని. నీ రూపరేఖావిలాసములకు, నీ ధైర్యసాహసము లకు, నీ నేర్పరితనమునకు నయిదుగురు భర్తల వరించుటకంటె సార్వభౌమ రాజాధిరాజ [illegible]ంకుఁడై, శూర వీర క్షత్రమండ

లుండై, సకల సంపదలచేత భూలోక దేవేంద్రుండై ద్యూతమున నిన్నుఁబందెముకొట్టక తా నోడక శత్రువైభవముల నోడించి కొనిన రాజచూడామణి నొక్కరిని భర్తగావరించుట పట్టపుదేవిగా నుండుట నీకు క్షేమము సుమా. సభాంతరాళమున క్షత్రియాంగన స్వతంత్రించి వివాహమాడుటకు ధర్మశాస్త్రము లనుజ్ఞ నొసంగి నవికదా.

దుర్యో— (ద్రౌపదికిఁ దనతొడపైఁ గూర్చుండుమని సంజ్ఞఁ జేయుచున్నాఁడు)

భీము— (కన్నులురుముచుఁ జూచి) ఓరి మాయాద్యూత సమాగత ద్రవిణ మదాంధ! కౌరవాధమా! అగ్రజాజ్ఞాబద్ధులయిన భీమాదుల నశక్తులుగానెంచి నీ వొనరించుచున్న నిష్ఠురంపుచేష్ట లనిష్టంబు నీ కొసంగునని స్పష్టముగా నమ్ముము. సభాసదులారా! అధర్మార్ణవ లోకనకుతూహల స్వాంతుండగు గృధ్రరాజుకడ నిర్భయంబుగ దుష్టవ్యాపారపరాయణుండగు సుయోధనాధముంగూర్చి వీరసింహుండగు భీముండు వలుకు ప్రతిజ్ఞ నాలింపుఁడు. ఇట్టి ప్రతిన మీ రెన్నండు వినియుండరు. ఇక ముందు వినఁబోరు. మఱియు నీ ప్రతిన భూతకాల వీరులకు సహపాఠియై, అధునాతన వీరకేసరి శిరఃకిరీటాలంకారమై, భవిష్యద్భారత వీరుల కాచార్యరూపంబై అత్రత్యశూరులకు భయంకరంబై శత్రుప్రతాపాగ్ని ప్రజ్వాలనంబై, పౌరుషోత్సాహకరంబై యొప్పుచుండుఁ గావున, దత్తావధానులు గండు. వినుండు. న్యాయపథానువర్తినియై నందనందనపాదార్పిత హృదయాబ్జాతయై ధర్మవిశేషపుంజీకృతసవీ సాకృతియై సభాంత రాళ ప్రకటీకృతసాధ్వీధర్మ విభవాభిరామయై చెన్నారు పాంచాలిని, అయోనిజను, అసూర్యంపశ్యను; న్యాయసభ నిర్భయంబుగ భర్తృసన్నిధానంబున అధమకులసంజాత ప్రబోధంబున రాజశబ్దమాత్రాధీభూతచిత్తుండయి పాండవపట్టమహిషిని తనతొడపైఁ గూర్చుండుమని కనుగీటుచు నంకస్ఫాలన మొనర్చు దుర్యోధను నాయోధనంబున నెల్లరు చూచుచుండ,

మ. కపటద్యూతసమాగతద్రవిణ ♦ దుష్కాదంబరీపానమ
త్తపరాధీనత ద్రౌపదిన్ గురువృపై ♦ దార్వంగ యత్నించు నా
♦ కుపితోత్సంగ మరాతికంఠవిదళ ♦ త్కోష్ణప్రవద్రక్తప
ల్లపితోగ్రాగ్రగదాభిఘాతముల జీ ♦ ల్చాల్ సేతు నే నాజిలోన్.

చ. ధనబలరాజ్యసంపద మద ♦ ప్రథితప్రభవన్మయుండు దు
ర్జనసహవాసనాశితప ♦ రాక్రమజిహ్వమనస్కు రాజప
త్నిని దనయంక భాగమున ♦ నిల్వు మటంచును చూపు దు
ష్టుని రణమందునన్ గురువు ♦ చూర్ణము జేసి వధింతు మద్గదన్.

మఱియు వైరికళ బడిశాయమానమదీయ బహుదండపరివర్తితగదా
దండాభి ఘాతంబున నా యంకంబు పొంకంబు వాపెద. ఆ తొడ
పొడిచేసెద. ఆకురువు నురుముజేసెద. ఆ యుత్సంగంబు విచ్ఛేద
మొనరించెద ఆయూరువు కోరివేసెద. ప్రాణంబుతోనున్న
నీ దురభిమానితొడలు విరిగి కొట్టుకొనుచుండ రణరంగంబున.

చ. తొడలు విఱెంగి రక్తమున ♦ దొర్లెడు దుష్టుని గారవేసు భీ
ముడు కడకాల వేగ శిర ♦ మున్ జెడదన్నుచు ఛీ దురాత్మ దు
ష్టుడ మును కృష్ణకున్ దొడను ♦ జూపిన దానిఫలంబుబూర్తిగా
గుడువుమురా యనంగ నిదు ♦ గో సభలో శపథంబు సల్పెదున్.

ఇందులకుం దప్పితినేని మాతృస్త్రీసమాగమదోషం బనుభవించువాడ.
(అని యన్నగారి ముఖము చూడవలయును.)

కర్ణు—అవును పాపము శక్తిలేదు. భార్యాపరాభవము జూచిసహించ
లేడు. మాటలచే రోషమును వెల్లడించుకొనక తప్పదు.

దుశ్శా—ఓసి గారడీకత్తెయ! ఎన్నిగుడ్డలు చుట్టినావే! దిసిమొలతో
నిలువబెట్టెదను లే! కులుకకు.

సభ్యు—ఛీ, ఛీ. పాపము - ద్రోహము - వినాశము. వినాశము.

ధృత—ఏమి యీ కలకలము ?

గంధా—నీ పెద్దకొడుకు దుందుడుకుతనము! విదురుని పిలిచి విచారిం
పుము. నాహృదయము చేయిపెట్టి కలచినట్లున్నది. వంశమునకు
చేటు మూడునట్లున్నది.

♦ (కటటోత్సంగమరాతికంఠదళనోత్కంఠోష్ణ)

ద్రోణు—నాయనా! వృకోదరా! పతివ్రతాపరాభవాగ్ని చెలరేగినది. కౌరవవంశ వినాశపిశునంబు అంకురించుచున్నవి! దుష్టపథానుయాయులగు ధార్తరాష్ట్ర వీరుల శయ్యాగృహంబులఁ గాకఘూకఘూత్కారంబులు సెలరేగుచున్నవి. కౌరవస్త్రీ హృదయాంతరాళంబుల వ్రేలు మంగళ సూత్రంబులు మనోగత దుఃఖాతిరేకంబులఁ దప్తంబులగుచున్నవి. ధృతరాష్ట్రాగ్ని హోత్రాయతనంబున వరళులు ప్రవేశించి గగ్గోలు వరుచున్నవి. గార్హపత్యాహవనీయదక్షిణాగ్నులు ప్రశాంతములయినవి, సాధ్వీకులాలంకారయగు గాంధారిముఖంబున దీనవర్ణప్రాదుర్భావ మగుచున్నది. దుర్మార్గుల కతంబున వంశోపప్లవంబు సమీపించు చున్నది. మీమీ ప్రతాంబులు నిమిత్తమాత్రంబులు గావున నీప్రజ్ఞ నెఱవేఱును. ఇది కాలముగాదు. కోపంబుఁ జూపింపఁ నిది యదనుకాదు. గురుభక్తి కలవాడవు. కావున నీ కుపదేశింప నా మన ముత్సహింపు చున్నది. అగ్రజాజ్ఞ నాదరింపుము.

భీము—(అసహ్యముతోఁ దలవంచుకొని చతికిలబడుచున్నాఁడు)

గంధా—నాయనా! విదురా! నీ ప్రభువునకు సవిస్తరముగ నీవిషయముఁ దెలియఁజేయుము.

విదు—(ధృతరాష్ట్రుని సమీపించి) మహాప్రభూ! పాండవ రాజసూయవైభవసందర్శనసంజనితామయా క్రాంతుఁడగు దుర్యోధనుండు మాయా ద్యూతము నెపంబున ద్రౌపతి నోడికొని సభాంతరాళమున వివస్త్రఁజేయ దుశ్శాసనుండు నడుముకట్టుకొని సుయోధన రాధేయానుమతంబున వలువ లొలుచుచునుండుకతంబున భవదగ్నిహోత్ర జ్వాలలు నక్కలకు నివాసంబయ్యె. అగ్నులు చల్లారినవి. ఉత్పాతంబు లుద్భవిల్లినవి. ఇంక వంశక్షేమము పుత్రుని ప్రాణరక్షణయు జేయుభారము దేవరధీనమయియున్నది.

ధృత—నా యుపేక్షయే యింత తెచ్చినది. నాయనా! సుయోధనా!

చ. పరమపతివ్రతన్ సభఁ ♦ దపస్విని పాండవధర్మపత్ని ధ
ర్మరత నయోనిజం బ్రకృతి ♦ మానవభామినిగాఁ దలంచి దె

ప్పురములు వల్కఁగాదగునె ♦ బాల్యమునాదిగ దుష్టభావనం
బెఱింగితి నీ నిమిత్తమునఁ ♦ బెద్దయు దుఃఖితులైరి పాండవుల్.

నాయనా! పలుమారు విదురనీతి యాధారముగ నమ్మమను నా నుడువులఁ బెడచెవినిడి కులమున కుపద్రవంబు తెచ్చిపెట్టుకొంటివి. ఇంకనైన ధర్మాత్ములగు పాండవులపై దురాగ్రహంబు మానుము. సకల బాంధవహితంబుగ నేఁ జేయఁ దలంచినదాని కంగీకరించుము. నిత్యము, ప్రాతఃకాలంబున వంద్యురాలగు నీవధూనికకు నమస్కరించి పాపములం బాపికొనుము. విదురా! అమ్మాయిని పాంచాలిని నిటు బిలువుము.

దుర్యో— (అసహ్యముతోఁ దొలఁగిపోవును.)

గాం— ఏది కోడలు ?

విదు— (ద్రౌపదిని సమీపించి) సాధ్వీ !

ద్రౌప— (గాంధిరిని సమీపించవలయు)

గాం— అమ్మా! పాంచాలి!

విదు— అదుగో! పాదాభివందన మొనర్పఁ బూనుచున్నది!

గాం— (లేచి ద్రౌపదిని కౌగలించుకొని) అమ్మా! సతీమణీ! నావంటి పెద్దదానిచెంత నాకడుపు చెడఁబుట్టిన కుమారులకతంబున నీకుఁ గలిగిన పరాభవము సహించుము. లోకంబున గల స్త్రీజనంబుల కెల్లఁ దలకట్టగు పాతివ్రత్యమహిమా విభవంబుఁ బ్రకటించిన నీ పవిత్రశరీరమును గౌఁగిలించుకొననిమ్మా. మావంశమును దరింపఁ జేయుటకు నవతరించిన శ్రీమహాలక్ష్మివి. నీ పాదోదకము సకల సీమంతినీసీమంతధారణా యోగ్యంబు. నీదర్శనంబు సమస్తపాపక్షయంబు. నీ నుడి బ్రహ్మస్వరూపంబు. నిన్ను స్పృశించినఁ బాపాత్ముల పాపంబులు నాశనంబులగును. నీకపకార మొనరించిన దురాత్ముల పాపంబులు నీ కరుణాకటాక్షప్రసారము లేనిది యెన్నటికిని నశింపనేరవు. ఇటురమ్మా. (అని ధృతరాష్ట్రుని సమీపమునకు దీసికొని పోవలయును.)

ద్రౌప— పాండవపట్టమహిషి, కురుకుమారపరాభవీభూత, ద్రౌపదినమస్కరించుచున్నది. (అని నమస్కరించవలయును)

ధృత— అమ్మాయి! నీవు నా కోడండ్రియందుఁ బూజనీయురాలవు. నా కోడండ్రిననేల? స్త్రీసముదాయములకెల్ల వందనీయవు తల్లీ! స్త్రీల కననేల? పుణ్యులగు పురుషావలికెల్ల స్మరణీయ సుగుణ గణ్యవు. కావున సుపేషాదోషమున నేఁ జేసిన నా నేరము సైచి "పితృసమో జ్యేష్ఠః" యను న్యాయంబున జ్యేష్ఠుని యిల్లాలవు గావున, నీమఱందులగు సుయోధనాదుల కుమారులగా భావించి వారలపైఁ గోపంబు నాకుగా సైచుము సాధ్వీ! నీకుఁ బ్రియంబు సేసెద. నీయిష్టమెద్దియో వేడుము.

ద్రౌప— మహాప్రభూ! యీ సేవకురాలు తమ కాశీర్వచన పాత్రు రాలుగాని స్తుత్యర్హురాలు కాదు. ధర్మమే జయమని నమ్మినదా నను. దయచేనాకు వరము ప్రసాదింపఁదలంచితివేని, దయామయుం డవుగావున మనునిభుండ్వై, ధర్మస్వరూపుండైన ధర్మనందనుని దాస్యంబుఁ బాపవలయును. ప్రభువులట్లు కటాక్షించిన నహంకా రాభి మానులగు కురుకుమారులు కురువృద్ధజనలాలితుండై పెరిగిన ప్రతివిందుని దాసపుత్రుండనకుందురు. ఇదియ నాయభీష్టంబు.

ధృత— అమ్మాయి! అట్లొసంగితి. రెండవవరము వేఁడుము.

ద్రౌప— భూపాలతిలకా దయాస్వరూప! నాయభీప్సితంబు నెరవేర్పఁ దలంచితివేని, యుధిష్ఠిరు నలువురుసోదరులును తమయాయుధముల తోను, వర్మ వరూథినులతోడను, దాస్యనిర్ముక్తులు కావలయును.

ధృత— సాధ్వీ! నీకోరినవరంబు లొసగితి నింక మూఁడవ వరంబు వేఁడుము.

ద్రౌప— దయాస్వరూపులగు తా మెన్నిమైన వరంబులొసంగ సమ ర్థులు కాని కోరుటకు నా కధికారము లేదు. కోమటి జాతియం దుద్భవించిన సాధ్వికి నొక్కవరమును, క్షత్రియాంగనకు రెండు వరములును, శూద్రజాతిసతికి మూఁడువరంబులును బ్రాహ్మణ సతికి నూఱు వరంబులును వేఁడ నధికారము కలదు. కావున నెక్కువ కోరజాలను.

ధృత— మహాధర్మ స్వరూపురాలవగు నీకుం దెలియని ధర్మరహస్యం బులు కలవా? నీసుగుణములకు మెచ్చితిని. నీవుకోరకయే వరంబు లిచ్చెద. నాయనా! యుధిష్ఠిర! సోదరసహితుండవై యొకపరియిటు రమ్ము.

పాండ— పాండవులువచ్చి ధృతరాష్ట్రునకు నమస్కరించవలయు.)

ధృ—అబ్బాయి! ధర్మనందనా! నీవు సదావృద్ధోపసేవివి. ఎల్లధర్మ ములునీవే యెఱుంగుదువు. తెలియక నీకెగ్గుచేసిన నా కుమారు నేరము సైచుము. ఉత్తమ పురుషుండు పరుల నేరములఁ దలంప కుండుటయు. గుణంబుల గ్రహించి దోసంబుల విడుచుటయు సహ జముగాఁ గలిగి యుండును. ఉత్తమగుణాలంబ నుండవగు నీవు క్రోధము మనంబునఁ జననీయవు, కావున ననుజసహితుండవై స్వరాజ్యంబు గొని సకల సంపదలతోఁ దులఁదూగుచు నెప్పటి యట్ల నింద్రప్రస్థపురంబున కరిగి సుఖంబుండుము. ఏను వెనుక ముందు యోచింపక జూదం బుపేక్షించితి. అల్పబుద్ధి సత్వుండ నయి వృద్ధుండనైన నన్నును మీ తల్లియైన గాంధారిని దలంచి, దుర్యోధనాదులు సేసిన దుర్నయంబులఁ దలంపకుండునది సర్వశా స్త్రవిదుండయిన విదురుఁడు మంత్రిగా సర్వధర్మవిదుండయిన నీవును రక్షకుఁడయిన, నీ కురుకులంబు క్షేమంబుగా నుండును. వంశము కాపాడుభారము నీయది. నీకొండుకోరిక కల్గినగోరుము.

ధర్మ— తండ్రిగారి కోరికదీర్చుటయే నాఁకుభీష్టంబు. రాజులు దాయాద ద్వేషముహాని యన్యోన్య ప్రియులై సతులు సాధ్వులై వంశము లకును దేశములకును శుభములు సమకూర్చి పతివ్రతామహిమాభి రాములయి యుండు నట్లాశీర్వదింపుడు. లోకజాలంబు శుభంబుగా నుండుటయె నాయభీష్టము. పాపము శాంతించుగాక. శుభములు వర్ధిల్లుగాక !!

సంపూర్ణము.

శ్రీ సత్యనారాయణ ప్రింటింగు వర్క్సు, విజయవాడ.

## ఆంధ్ర దేశమంతటా ప్రదర్శింపబడుచున్న
## మా స్టేజీ నాటకములు



| | | | | |
|---|---|---|---|---|
| శ్రీ కృష్ణతులాభారం | ముత్తరాజు | 1 | 12 | 0 |
| రంగూన్ రౌడి | సోమరాజు | 1 | 12 | 0 |
| ధరణికోట | ,, | 1 | 12 | 0 |
| సతీ సక్కుబాయి | ,, | 1 | 12 | 0 |
| చింతామణి | కాళ్లకూరి | 1 | 12 | 0 |
| మధు సేవ | ,, | 1 | 12 | 0 |
| విప్రనారాయణ | పానుగంటి | 1 | 12 | 0 |
| కోకిల | ,, | 1 | 12 | 0 |
| పాదుకా పట్టాభిషేకం | ,, | 1 | 12 | 0 |
| ద్రౌపదీ వస్త్రాపహరణము | మల్లాది | 1 | 12 | 0 |
| కలియుగ వైకుంఠము (వెంకటేశ్వర మహాత్మ్యం) | తాండ్ర | 1 | 8 | 0 |
| సతీ సులోచన | ,, | 1 | 4 | 0 |
| మైరావణ | మాచర్ల | 1 | 8 | 0 |
| కృష్ణగారడి (భీమార్జున గర్వభంగం) | | 1 | 0 | 0 |
| దక్షయజ్ఞము | ముత్తనేని | 1 | 8 | 0 |
| చండిక | ,, | 1 | 8 | 0 |

వెలయువారు :-

**సరస్వతీ బుక్ డిపో, విజయవాడ-1.**